# పీ ఠి క.



శ్రీసచ్చిదానంద రహితసద్గురు కేవలాత్మనేనమః.

శ్రీమదఖండ. కావేరీనదీ తీరంబున నుండు తిరుచునాపల్లి పట్టణనివా నుండు ను శ్రమోయఘమహాఋషి గోత్రోద్భవుండుననగు తిరుచునాపల్లి వెంకటాచలంసెట్టి యార్ కొన్గల్ అనేవారికి ద్వితీయపుత్రుండను రంగస్వామి శెట్టి యనేవ్యవహారనామముగల నేనుకృష్ణానదికి సమీపముననుండు కారెంపూడియను గ్రామమునకు వైద్యాధికారముగా వచ్చి,మోక్షాపేక్ష గలవాడనై గొన్నిదినంబులు మనంబునం గుందుచుండగా నాపూర్వజన్మ సుకృతంబున మహాయోగ పురుషుండును అచలపరిపూర్ణుండు ననగు|పులహరిఫీరోజీ గారను సద్గురుస్వాముల వారువిజయముచేసి రన్నవార్తనువిని, ఆమహాత్ముని సన్నిధికింబోయి వారినిందోడ్కొని వచ్చియుచితాస నంబునంగూర్చుండబెట్టి, అర్ఘ్యపాద్యాది విధులచేతం బూజించి-స్వామీ ? సద్గురువర్యా ? మానవులు జననమరణ ప్రవాహములనుండి దొలంగి జన్మరాహిత్యమగు పరమపదము నెటులబొందుదురో, అట్టిమార్గమును నాకుంబోధించినన్ను గృతార్థునిగా జేయుమని ప్రార్థించిన, నామహాత్ముండు చిఱునగవుతో నున్నుంగాంచి, బిడ్డా ? నీవుఆవాఙ్మానస గోచరంబైన పరమపదమునే గోరితివి - సాలోక్యము, సారూప్యము - సామీప్యము సాయుజ్యము - సార్ష్టిత్వము - మోక్షములనెడు ఆరుపదవులను- గడచినదే జన్మరాహిత్యమైన పరమపదము. అట్టిపరమపదమును యెంతటివారికిం బోధించుటకును నేనుశక్తుఁడనుగాను - ఐననుసద్గురు పరంపరను చేకొనివినుతింతు, వినుము. శ్రీసదాశివులవారిని, వసిష్ఠమహాఋషిని, జనకమహారాజును. శుకబ్రహ్మమును - సాందీప మహాఋషిని, శ్రీకృష్ణభగవానులను - ఉద్ధవార్జునులను - శ్రీధరస్వాములను - శ్రీశివరామదీక్షితుల వారిని - వల్లూరి-రామకృష్ణయ్య గారిని - రంగాచార్యుల వారిని - లక్ష్మణాచార్యుల వారినిమనంబునం చేకొని,జమిలి శేషగురుని పాదపద్మములనుహృదయకమలమందు నిల్పుకొనినీకు పరమపదమార్గమును బోధింతును - నీవునిశ్చలమనంబుతో దెలియుమని భక్తి యోగ-జ్ఞాన-అచలభావములను బోధించినన్ను జననమరణ ప్రవాహములనుండి తప్పించిపరమ పదమును బొందించిరి. నేనుసద్గురు బోధను మనంబుననిల్పుకొని నాకుంగలసంశయములను పెద్దలగోష్టివల్లనున్ను గ్రంధపరిశీలనవల్లనున్ను రహితపరుచుకుంటూవచ్చినందుకు-ఆసంగతులను గ్రంధరూపకముగా వ్రాయవలెననదని మద్గురుపత్నియగు-పులహరి వీరాబాయమ్మగారు ప్రేరేపించుటవల్ల గురుశిష్యసంవాద రూపంబగు ముక్తిప్రదాయినియను నీగ్రంథమును-ఆంధ్రంబున వచనకావ్యముగా రచియించి-అచలగురుండగు పోకల-శేషాచలార్యయునిచేత దిద్దుబాటు చేయించి-అచ్చుకూర్పింపంబడెను. అచలస్వరూపులగు పెద్దలు యిందలితప్పొప్పుల నంగీకరించి మన్నింతురని ప్రార్థించుచున్నాడను.

# విషయసూచిక.







ఈగ్రంథము, భక్తులును, యోగులును, జ్ఞానులును, అచలులును, జదివియును, వినియును, ఆనందించుట కొఱకై ననేక దృష్టాంతములను బ్రయోగించితిని. ఇందుప్రమాద దోషంబులేమైన నుండిన యెడల పెద్దలు సవరించి మన్నింతురని కోరుచున్నాడను.

☞ గ్రంథకర్త-టి. వి. రంగస్వామిసెట్టి.



శిష్యుడు-టి-వి-రంగస్వామిసెట్టి.



ఫీరోజీ - గురుడు.



శ్రీగురుభ్యోనమః.

# ముక్తిప్రదాయనియను-గురుశిష్య సంవాదము

హరిఃఓమ్

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥

## భక్తిమార్గము.

ప్రశ్న. స్వామీ! లోకమునందు పురుషార్థములు-ఎన్ని విధములు?

ఉత్త. శిష్యా! పురుషార్థమని, పరమపురుషార్థమని రెండు విధములు.

ప్రశ్న. పురుషార్థములనగా-ఏవ్వి?

ఉత్త. ధర్మార్థకామముల మూటిని-పురుషార్థములుగా జెప్పుదురు.

ప్రశ్న. పరమపురుషార్థమనగా-ఏది?

ఉత్త. మోక్షమని చెప్పఁబడును.

ప్రశ్న. అయితే ధర్మార్థకామ మోక్షములనే - ఈనాలుగు పురుషార్థములు సకలజీవకోటులకు-ఆచరింపఁదగిన వేనా?

ఉత్త. ధర్మార్థకామములనే మూడు మాత్రమే - సకల ప్రాణికోటిచే. ఆచరింపఁదగినవేకాని, మోక్షము మాత్రం మనుష్యులచే-ఆచరింపందగినది. కాబట్టి మానవ జన్మమెత్తినందుకు ఫలమేమనగా-జ్ఞానము గలిగి మోక్షము సాధించుటయే-ఫలము. అట్టి జ్ఞానము లేని మానవులు పశుప్రాయులని యెన్నబడుదురు. ఇందుకు సమ్మతము.

శ్లో॥ ఆహారనిద్రాభయమైథునాని।సమానమేతత్పశుభిర్నరాణాం।జ్ఞానం నరాణామధికంవిశేషో।జ్ఞానేనహీనఃపశుభిస్సమానః॥ అనియున్నది.

ప్రశ్న. మోక్షపదవులు యెన్నివిధములు?

ఉత్త. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, సార్ష్టిత్వ, విదేహకైవల్యమనెడి మోక్షమను పదవులు-ఆరు విధములు.

ప్రశ్న. అట్టిపదవులు ప్రాప్తించుటకు సాధనాంతరము లెయ్యవి?

ఉత్త. భక్తి-వైరాగ్య-యోగ-జ్ఞానములని-నాలుగు విధములు.

ప్రశ్న. భక్తి వైరాగ్యములవల్ల పొందదగినవి యెయ్యవి?

ఉత్త. సాలోక్య. సామీప్య, సారూప్య, సాయుజ్యంబులనే-నాల్గున్ను, భక్తి వైరాగ్యములవల్ల పొందతగినవి.

ప్రశ్న. సాలోక్యమనగా-ఎటువంటిది?

ఉత్త. శ్రీహరి లోకమందుండుట.

ప్రశ్న. సామీప్య మనగా-ఎటువంటిది?

ఉత్త. శ్రీహరి సాన్నిధ్యమును బొందుట.

ప్రశ్న. సారూప్యమనగా-ఎటువంటిది?

ఉత్త. శ్రీహరివలె చతుర్భుజాది చిహ్నములు కలవాడై యుండుట.

ప్రశ్న. సాయుజ్యమనగా-ఎటువంటిది?

ఉత్త. శ్రీహరి యందైక్యమగుట.

ప్రశ్న. అయితె భక్తి యెన్నివిధములు?

ఉత్త. బాహ్యభక్తి, అనన్యభక్తి,ఏకాంతభక్తి-అనిమూడువిధములు

ప్రశ్న. బాహ్యభక్తి-అనగా-ఎటువంటిది?

ఉత్త. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము,వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము. అనెడి-తొమ్మిది విధములయిన భక్తిచే శ్రీమహావిష్ణువును ధ్యానించుట.

ప్రశ్న. ఈ శ్రవణాది నవవిధ భక్తి మార్గములు వివరముగాఁ జెప్పుడు?

ఉత్త. శ్రవణము, అనగా-శ్రీమహావిష్ణు చరిత్రంబుల ప్రేమచే వినుట. కీర్తనము, అనగా-శ్రీహరి లీలావినోద చరిత్రములను అత్యాసక్తితో పాడుట.

స్మరణము-అనగా-శ్రీమహావిష్ణువుయొక్క. అనంతనామములు అత్యంతభక్తిచే స్మరించుట.

పాదసేవనము, అనగా-శ్రీమన్నారాయణుని దివ్యపాదపద్మములు హృదయమందు నిలుపుట.

అర్చనము, అనగా-శ్రీరమాధవుని మానస పూజ చేయుట.

వందనము, అనగా-శ్రీగోవిందునియొక్క సర్వావయవములను, వేర్వేరుగా ధ్యానముచేసి మనోవందనంబులు చేయుట.

దాస్యము, అనగా-శ్రీజనార్దనుని సర్వకాల సర్వావస్థలందును మరువక ధ్యానము సేయుట.

సఖ్యము, అనగా-శ్రీపద్మనాభునియొక్క ధ్యాన పరాయణుండై అనన్యవృత్తితోనుండుట.

ఆత్మనివేదనము, అనగా-అట్టి పురుషోత్తమునియందు నిశ్చల హృదయమును సమర్పించుట.

ప్రశ్న. అయితే, అనన్యభక్తియనగా-ఎటువంటిది?

ఉత్త. సకల ప్రపంచము విష్ణుమయమనియును, విష్ణువు సర్వమయుండనియును, విష్ణుమయముగాని వస్తువు లేశమైనను లేదని తలంచుచు నిశ్చయాత్మకుండై యుండుట.

ప్రశ్న. ఏకాంతభక్తి, అనగా-ఎటువంటిది?

ఉత్త. పరబ్రహ్మమై, పరమాత్మస్వరూపుండై, సకల జీవకోటులకు వెలుపల, లోపల, ముందు, వెనుక, ఇరుపార్శ్వములను నిండి నిబిడీకృతమై, సకలకారకుండై యుండెడి విష్ణువునందు (సముద్రమునందు వాయువశముచేత తరంగములు పుట్టిన విధముగా) మాయాప్రపంచము కలిగినదని సందేహము లేక, సర్వసాక్షిభూతుండై యుండెడి శ్రీహరినిజ్యోతిరూపముగా తలంచి తదేకనిష్ఠాపరుండై యుండుట. స్వాశ్రమవిహితకర్మ చేయకుండా కేవల భక్తి వృద్ధిపొందదు.

ప్రశ్న. అయితే, బాహ్యభక్తికలవాడు యేయేకర్మ లాచరించును?

ఉత్త. తన-ఆశ్రమోచితములగు కర్మలు-ఆచరించుచు ఫలకాంక్షియై యుండును.

ప్రశ్న. అనన్యభక్తికలవాడు యేయేకర్మలాచరించును?

ఉత్త. తన-ఆశ్రమోచిత కర్మంబులు ఫలత్యాగియైభగవన్నియామకంబులని సేయుచుండును.

ప్రశ్న. ఏకాంతభక్తి గలవాడు యేయేకర్మలాచరించును?

ఉత్త. కర్మ-ఈశ్వరాజ్ఞ గావున కర్మవ్యతిరిక్తమయిన భక్తిచే ఈశ్వరుఁడు సంతోషించడని తలంచి ఫలకాంక్షిగాక, యధావిహిత కర్మములను - ఈశ్వరార్పణములుగా సేయుచుండును. కనుక బాహ్యభక్తి-అనన్యభక్తికిన్ని, అనన్యభక్తి-ఏకాంతభక్తికిన్ని, సాధనములై యుండును.

ప్రశ్న. ఈత్రివిధములైన భక్తిమార్గములలో యేభక్తి యేపదంబొసంగును?

ఉత్త. బాహ్యభక్తి సాలోక్యంబునిచ్చు, ఈ భక్తి దృఢముగా నుండిన యెడల సామీప్యంబును, ఇచ్చును.
అనన్యభక్తి సారూప్యంబు నిచ్చును.
ఏకాంతభక్తి సాయుజ్యంబు నిచ్చును.

ప్రశ్న. కర్మవినాభక్తి వృద్ధిహొందదని చెప్పితిరిగదా, కర్మప్రచారం బెటువంటిది?

ఉత్త. కర్మలు లౌకికమనిన్ని, వైదీకమనిన్ని, రెండువిధములు.

ప్రశ్న. లౌకిక కర్మయనగా ఎటువంటిది.

ఉత్త. లోక వ్యవహారకార్యములన్నియులౌకికకర్మలని చెప్పఁబడును.

ప్రశ్న. వైదికకర్మ యనగా - ఎటువంటిది?

ఉత్త. నిత్యమనిన్ని, నైమిత్తికమనిన్ని. కామ్యమనిన్ని,నిషిద్ధమనిన్ని, ప్రాయశ్చిత్తమనిన్ని, అయిదు విధములుగా గలది,

ప్రశ్న. నిత్యకర్మ యనగా-ఎటువంటిది?

ఉత్త. స్నాన, సంధ్యావందన, జప, తప, హోమ, దేవతర్పణ, వైశ్వదేవ, అతిథిపూజ, మొదలగునవి.

ప్రశ్న. నైమిత్తిక కర్మ యనగా-ఎటువంటివి?

ఉత్త. ఒకనిమిత్తమును అనుసరించి చేయునది, అనగా సంక్రాంతి-ఉత్తరాయణ, దక్షిణాయణ, అర్ధోదయ, మహోదయములు మొదలగు పర్వ దినములయందు కాలముతప్పకుండా స్నానజపాదులు చేయునది.

ప్రశ్న. కామ్య కర్మ యనగా-ఎటువంటిది?

ఉత్త. అశ్వమేధ, రాజసూయ, పౌండరీక, సోమము మొదలగు యజ్ఞములను జేయుట.

ప్రశ్న. నిషిద్ధకర్మ యనగా-ఎటువంటిది?

ఉత్త. శాస్త్రములయందు నిషేధించ బడ్డది, అనగా - పరద్రవ్యాపహార. పరనింద, పరదారగమన, పరహింస, మధ్యపాన,చోర, అనృతాదులు.

ప్రశ్న. ప్రాయశ్చిత్త కర్మ యనగా-ఎటువంటిది?

ఉత్త. శాస్త్రనిషిద్ధకర్మలాచరించి నందువలన వచ్చిన దోషములను పరిహరించుటకై చేయుకర్మ లనగా - అరణ్యవాసము, జలభక్షణ, వాయుభక్షణ, పర్ణభక్షణ, తీర్థయాత్ర - చాన్ద్రాయణ, పంచగవ్యాదికర్మములు చేయుట.

ప్రశ్న. ఇట్టికర్మ లాచరించినందువలన గల్గు ఫలమేమి?

ఉత్త. నిత్యనైమిత్తిక కర్మలు యావజ్జీవపర్యంతము చేసినట్టులయితే ప్రారబ్ధము నశించును. కామ్యకర్మవల్ల, స్వర్గాదిభోగములు కల్గునుగాని విదేహకైవల్యము కలుగదు. తిరిగి జననమరణాములు గల్గును. ఇందుకు సమ్మతము.

శ్లో॥ జ్యోతిష్టోమేనస్వర్గకామోయజేత।క్షీణేపుణ్యేమర్త్యలోకేవిశన్తి॥

అని స్మృతి ప్రమాణము వున్నది. నిషిద్ధకర్మ చేసినట్టులయితే, నరకప్రాప్తికలుగును.

ప్రాయశ్చిత్తకర్మ లాచరించినట్లైతే, నిషిద్ధకర్మలవల్లవచ్చే ప్రత్యవాయమును బోగొట్టి పురుషునికి తిరిగి కర్మాధికారమును కలుగచేయును. ఈ అయిదు కర్మలలో కామ్య నిషిద్ధప్రాయశ్చిత్తములనే మూడు కర్మలు జ్ఞానసాధనములుకావు, పైనచెప్పబడిన నిత్యనైమిత్తికములనే రెండు కర్మలుసాత్విక, రాజస, తామసములని మూడువిధములయ్యె, ఈమూడింటిలో రాజస తామసములనే రెండుకర్మలు జననమరణ వృద్ధి కారణములే గాని, జ్ఞానమునకు కారణములుగావు. సాత్వికకర్మఫలకాంక్షిగాక, ఈశ్వరార్పణగా చేసినట్లాయనా, చిత్తశుద్ధికలుగును. కర్మ అజ్ఞానమునకు విరోధికాదు గనుక కర్మవల్ల అజ్ఞానము నశించదు, చీకటిమేఘావరణముచేత వృద్ధిబొందునటుల నధికమవును, కర్మకర్తృత్వము కలుగజేయునది గనుక, అజ్ఞానమును దొలగ చేయజాలదు. అది యేలాగంటె, తనకు అర్థము తెలియని ఒక శ్లోకముయొక్క అర్థము, గంగాస్నానము చేసినప్పటికిన్ని, లక్షగాయత్రీజపము చేసినప్పటికిన్ని తెలియదు. దాని అర్థము తెలిసినవారిని అడిగి తెలుసుకొనవలెను, దినశుద్ధి తెలియగలందులకు పంచాంగముద్వారా తెలియవలెను గాని, ఇతరసాధనములవల్ల తెలియదు, కాబట్టి కర్మవల్ల జ్ఞానంరానేరదు. చిత్తశుద్ధివలన సద్గురులాభమున్ను, సద్గురులాభము వలన శ్రవణమున్ను, శ్రవణము వలన జ్ఞానమున్ను గలుగును, కాబట్టి సత్వగుణాధిష్టితమైన కర్మచిత్తశుద్ధికి కారణమవును. మోక్షమునకు సాక్షాత్సాధనముకాదు. ఇందుకు సమ్మతము.

శ్లో॥ జ్ఞానకర్మపదార్థౌద్వౌ । భాస్యభాసకలక్షణౌ । జ్ఞానాన్మోక్షోన కర్మభ్యః । ఇతి వేదాంతడిండిమః ॥ అనియున్నది.

ప్రశ్న. అయితేకర్మయుక్తమయినభక్తివల్ల, లింగదేహముతోపొందగ ల,స్వర్గాదిభోగములుకలుగుననినామనంబునకుదృఢమైనది. స్వామీ! ఇంకయోగమార్గముయెటువంటిదో సెలవియ్యవలయును?

## యోగ మార్గము

ఉత్త. యోగమనగా - అభ్యాస యోగమనియును, జ్ఞానయోగమని యును రెండు విధములుగా గలది.

ప్రశ్న. అభ్యాస యోగమనగా-ఎటువంటిది?

ఉత్త. అభ్యాసయోగమును మంత్రయోగమనియును, లయయోగమ నియును, హఠయోగమనియును మూడుమార్గములుగాగలది.

ప్రశ్న. మంత్ర యోగమనగా-ఎటువంటిది?

ఉత్తర. ఏకాక్షరం, ద్వ్యక్షరం, షడాక్షరం, అష్టాక్షరం. ఇవి అజపా మంత్రములలో నంతర్భూతములు, వీటిలో ఏకాక్షర మయిన ప్రణవమే ముఖ్యమైనదియును, బ్రహ్మస్వరూపమును గనుక, ము ముక్షువునకు-ఈ ప్రణవమే ముఖ్యముగా జపముచేయతగినది. ఇదియే-అతిరహస్యంబైన తారకంబనందగు. అజపమంత్రైక్య మధ్యంబైన బ్రహ్మావాచకంబు వహ్ని సూర్య చంద్ర రూపకం బైన మండలత్రయస్థానంబై యుండును.ప్రణవ తేజస్సువినా, తేజ స్సు లోకంబున లేదు. గనుక ప్రణవమే పరంజ్యోతిర్మయంబై న బ్రహ్మస్వరూపంబు: ప్రణవమే నాదబిందుకళాత్మికము:. ఇట్టి ప్రణవస్వరూపంబు దెలసి, కొంతదడవు జపంబుచేయవలయును. ఈ తెఱంగున అనాహతంబైన స్వరయుక్తముగా చిత్తంబున స్మరియించుచు, అంతట ఉచ్ఛ్వాస నిశ్వాసంబుల కొంచపర చుచు, ప్రణవంబు చిత్తంబుననిల్పి తలంచుచు, ప్రణవార్థరూ పంబైన మండలత్రయంబు యేకీభావంబైన తేజంబుగాభావిం పుచుసహజంబుగానుండుట, ఇందుకుసమ్మతము. ఓంబ్రహ్మయని

శ్రుతిన్ని, ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మాయని భగవద్వాక్యమున్ను.

శ్లో॥ సప్తకోటిమహామంత్రా చిత్తవిభ్రమకారకాః। ఏకయేవపరో మంత్రో గురురిత్యక్షరద్వయం॥

అని పరమ శివుని వాక్యమున్ను గలిగి యున్నది.

ప్రశ్న. లయయోగమనగా-ఎటువంటిది?

ఉత్త. ఈ లయ యోగము అనర్గళప్రవాహమైనది గనుక, వివరింప నశక్యము. అయినను ముఖ్యతాత్పర్యము, ఏమనగా - పంచ వాయువులను బంధించి హంసనుదశములకు నెక్కించి నిశ్శబ్ద ముగా నుండుట.

ప్రశ్న. హఠయోగమనగా-ఎటువంటిది?

ఉత్త. ఏలాగంటె, యమ నియమాదులగు అష్టాంగముల చేతనైనను కేవల కుంభకముచేతనైనను, దశవిధ వాయువులను. ఇంద్రి యంబులను వశముచేసుకొనుట.

ప్రశ్న. అష్టాంగములనగా-ఎటువంటివి?

ఉత్త. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనియెడు యీ యెనిమిది - అష్టాంగములని జెప్పంబడును.

ప్రశ్న. యమమనగా-ఎటువంటిది?

ఉత్త. అహింసాపరులై బాహ్యేంద్రియ వృత్తులను వదలి, విషయ ములను మానియుండుట.

ప్రశ్న. నియమము అనగా - ఎట్టిది?

ఉత్త. గృహస్థాశ్రమమును వదలి, ఏకాంతముగా శుచిప్రదేశమందైనను - మఠాంతరంబునందైనను నివసించి, ఘోరాభ్యంజనం బులుమాని, ఇతరభాషణంబులా కర్ణింపక, యోగాభ్యాసా సక్తికలిగియుండుట,

ప్రశ్న. ఆసనమనగా-ఎటువంటిది?

ఉ_త్త. వ్యాఘ్రచర్మము, దర్భలు, కృష్ణాజినము, మొదలయిన పరిశుద్ధ వస్తువులచేతకల్పింపఁబడిన, ఆసనముగలవాఁడై, ఆరువదినాల్గు విధములయిన ఆసనములయందును అభ్యాసముకల్గవాఁడై వాటిలో, ఉత్తమ మయిన సిద్ధాసనంబునఁ గూర్చుండుట.

ప్రశ్న. ప్రాణాయామమనగా-ఎటువంటిది?

ఉ_త్త. ఇడా, మార్గంబునవాయువునుబీల్చి, కుంభకంబుననిల్పి, పింగళ మార్గంబున వదలుటయును, తిరుగ పింగళమార్గంబున వాయువును పూరించి కుంభకముననిల్పి, ఇడామార్గంబున రేచకంబు సేయుటయును, ఇటుల సవ్యాపసవ్య మార్గంబులయందు రేచకపూరకకుంభకములొనర్చునట్టిసామర్థ్యముగలవాఁడై ప్రణవ స్మరణ సేయుచు, పూరకంబు సేయునంతకు యిబ్బడిగా కుంభకంబున నిల్పి, అష్టాంగుళములు పూరకంబును ద్వాదశాంగుళములు రేచకంబునుగా, ప్రాణాయామంబు సేయుట.

ప్రశ్న. ప్రత్యాహారమనగా-ఎటువంటిది?

ఉ_త్త. షడ్రసముల భుజించుటనుమాని, వాటిలోతియ్యనిపదార్థంబైన శర్కర, పాలు, నెయ్యి, ఉదకం, అన్నం, మొదలగునవి తగు మాత్రం భుజింపుచు, మత్తుగలుగకుండా, ఆహారనియమము గలిగి, ప్రాణాయామము సేయుచువాయువును స్వాధీనముచేసుకొనుట.

ప్రశ్న. ధ్యానమనగా-ఎటువంటిది?

ఉ_త్త. మూలాధార - స్వాధిష్టాన - మణిపూరక. అనాహత - విశుద్ధ - ఆజ్ఞేయంబులను షట్చక్రములనున్ను, వాటిబీజాక్షర మంత్రములనున్ను, వాటికి అధిదేవతలైన గణేశ - బ్రహ్మ-విష్ణు - రుద్ర - జీవ - పరమాత్మకంబైన పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్మకంబైన ఆరుతత్వంబులను, మణిపూరకంబుననుండు అగ్నిమండలమునున్ను, అనాహతంబుననుండు సూర్యమండల

ముమున్ను, ఆగ్నేయప్రదేశముననుండుచంద్రమండలమునున్ను, ఇవిమున్నియు. ప్రత్యేకముగా ధ్యానముసేయుట.

ప్రశ్న. ధారణయనగా — ఏటువంటిది?

ఉత్త. షడాధారములవల్లను వాయువును వశముగాజేసుకొని, మూలాధారము మొదలుకొని అరుచక్రములను దాటి, అచ్చకము లయందుండెడి అపాన - సమాన- ప్రాణ-ఉదాన-వ్యానముల నెడి పంచవాయువులను - ఏకీభూతముగా, త్రికూట స్థానమందు జేర్చుకొని, పొగలేనిమంటవలె చలింపక వెలిఃగెడిదీపంబు మాడ్కి ప్రజ్వరిల్లుచు, ఆప్రదేశమందు - ఏకాగ్రచిత్తుడై నిష్ఠతోనుండుట.

ప్రశ్న. సమాధి యనగా- ఎటువంటిది?

ఉత్త. ధారణా నిష్ఠయందుయంతతడవు ఉండినను అంతవరకుసమాధి యనంబడు. ఈ సమాధియే, రాజయోగమనిచెప్పంబడును, ఈ రాజయోగమును సాధించుటకై యిరువదినాలుగు సంవత్సరములు పట్టును, ఇందుకై వాయు భక్షణ, జలభక్షణాది నియతాహారుడై జడలు ధరియించి నారచీరలుగట్టి భూశయ్యాగలవాడై శరీరమును మిక్కిలిక్షీణింపజేసి, అధికాయాసమునుజెంది నప్పటికిన్ని- ఈ యోగమువల్ల-అణిమాదిసిద్ధులున్ను సాక్షిత్వ సంపదయున్ను గలుగునేకాని విదేహకైవల్యముప్రాప్తించదు. ఇందుకు సమ్మతము,

శ్లో॥ యోగినోరాగిణశ్చైవ భోగినస్త్యాగినస్తథా । బ్రహ్మజ్ఞానంవినామోక్షః ఇతి వేదాంత డిణ్డిమః ॥ అనియున్నది.

తురీయయోగమందు-అష్టాంగములు వేరువిధముగా నున్నవి.

ప్రశ్న. స్వామీ! అవియెవ్వి యోవినగోరెద?

ఉత్త. తురీయ యోగమందు యమము, అనగా-ఆహారనిద్రేంద్రియా విజయంబును నిశ్చలశాంతియుంగలిగినదే-యమంబు.

ప్రశ్న. నియమము-అనగా నెద్ది?

ఉత్త. వికల్ప దోషరహితంబై, అసంశయంబగు గురుభక్తియు, యదృచ్ఛాలాభసంతుష్టియు, విరక్తి భావంబును, శరణ విగ్రహంబునుం గలిగిన దే-నియమం బనంబడు.

ప్రశ్న. ఆసనంబు-అనగా నెట్టిది?

ఉత్త. సర్వోదాసీన (సర్వస్థలములయందును గూర్చుండి) మనంబాత్మయందాసన్నంబగుటయే - ఆసనం బనందగు.

ప్రశ్న. ప్రాణాయామంబు-అనగానెద్ది?

ఉత్త. రేచక పూరక సూచకంబై యుభయ విరహితంబైన, అవిరుద్ధ కేవల కుంభకంబున ప్రాణంబుతీరంబుచేర్చి జగంబుమిథ్యయని తలంచుటయే-ప్రాణాయామంబు.

ప్రశ్న. ప్రత్యాహారంబు -అనగా నెయ్యది?

ఉత్త. అమలంబై, అంతర్ముఖంబైన-మనంబు బహిర్విషయసంగంబు మాని, ఆత్మప్రత్యయంబుల్యసంహృతంబులగుట వలన, మనంబు విక్షేపశూన్యంబై నిర్వ్యాపారంబుగానిలుచుటయే-ప్రత్యాహారంబనంబడును.

ప్రశ్న. ధ్యానంబు - అనగా నెద్ది?

ఉత్త. అద్వయంబైన, ఆత్మానుభవంబున సర్వంబును ఆత్మగానెఱుంగుచు, సకలభూత సమత్వంబును, నిత్య తృప్తియు కలుగుటయే-ధ్యానంబు.

ప్రశ్న. ధారణ - అనగా నెట్టిది?

ఉత్త. బాహ్యాభ్యంతరములయందేకంబుగా - స్వతేజోమయంబని పరతత్వంబుగాంచి, తదీయ ధారణ గాంచుటే - ధారణయనంబడును.

ప్రశ్న. సమాధి- అనగా నెయ్యది?

ఉత్త. నిర్వికారుండై నిందాస్తుతుల నొక్క-చందంబునవినుటయు, శీతో

ష్ణములనొక్కగతి స్పృశించుటయు, సుందరీజనంబులను, నిర్జీవ ములైనసాలెకట్రలను, నిర్వికారుడై. యొకరీతిగాజూచుటయు, షడ్రసముల నెక్క పగిదిచవిగొనుటయు, సుగంధ దుర్గంధములనొక్కమాడ్కి గ్రహించుటయు, ద్వంద్వనిర్ముక్తమైన నిశ్చల- ఏకాంతభావము సిద్ధించుటయు, మహనీయమహాసుషుమా ధియనంబడు. మఱియు వృత్తియే కాగ్రమగుచు-ఎఱుగుటకేమి యునులేక, భావాభావశూన్యమైయెద్దినిండియున్నదో, అదియే అమనస్కనిర్వికల్పసమాధి-అనంబడును.

ప్రశ్న. ఈయోగములు సాధించుటకు యింకాయితరములైన సాధనములుగలవా?

ఉత్త. నాదానంద ప్రభావమువలననున్ను, పంచముద్రల-అనుభవము వల్లనున్ను, అవి సాధింపవచ్చును.

ప్రశ్న. నాధానందప్రభావమనగా-ఎటువంటిది?

ఉత్త. నాదానందమనగా-రెండువిధములుగలది. ఆనందమనియును, కేవలానందమనియును జెప్పంబడును. ఆనందమార్గమునువినుము, సద్గురుకటాక్షంబున నాదబిందుకళలనెఱింగి, అంగుళద్వయంబునకర్ణరంధ్ర ద్వయంబునుమూసి,దశవిధనాదములనువినుటే-ఆనందము. కేవలానందమార్గమునువినుము? సద్గురుముఖంబున, నాదబిందుకళల నెఱింగి హంస సంచారస్రోవలను కనిపెట్టి యీయిడాపింగళ నాడులయందు హంసనుసంచ రింపజేయుచు, చిట్టునరేచించి-సూర్యుని చంద్రనాడియందును, చంద్రుని సూర్యనాడియందును గతులుతప్పించి నడిపించుచు, చంద్రభాస్కరులను జీకాకుపరచి, సర్పమునకు కాకపుట్టించి దశవిధనాదములను బయటతీశి శ్రోత్రములను మూయకనే సదావినుపించుట, బ్రహ్మానందమనియును, కేవలానందమనియును జెప్పంబడును. ఈ మార్గముచేత అహంకార మమకారంబులును,

కామాది శత్రువర్గంబుననశించును. నాదముల వివరము-జలధి ఘోష నాదంబును, చిణీనాదంబును, భేరీనాదంబును, మృదంగనాదంబును, కాహళనాదంబును, వేణునాదంబును, భ్రమర నాదంబును. తాళ నాదంబును, శంఖా నాదంబును, ఘంటా నాదంబును, ఈ దశవిధ నాదంబులు - అనిచెప్పంబడును.

ప్రశ్న. పంచ ముద్రలనగా-ఎటువంటివి?

ఉత్త. భూచరియనియు, ఖేచరియనియు, మధ్యమయనియు, షణ్ముఖయనియు, శాంభవి యనియు-అయిదు విధములు.

ప్రశ్న. భూచరియనగా-ఎటువంటిది?

ఉత్త. గురువువలన పంచాక్షరీ మంత్రమునున్ను, ఆమంత్రార్థములనున్ను తెలుసుకొని, ఆసనాధిష్ఠుడై నేత్రములను దెరచి నాసిక కొనయందు దృష్టినిల్పి చూచి నదియే భూచరీ ముద్రయనంబడును.

ప్రశ్న. ఖేచరియనగా-ఎటువంటిది?

గురువువలన పంచాక్షరీ మంత్రమునున్ను, ఆమంత్రమూలమునున్ను, ఆమంత్రార్థమునున్ను, ఆమంత్రాధి దేవతలైన పరశివాలోకననున్ను దెలుసుకొని, పద్మాసనమందు కూర్చుండినదుమునిక్కి-ముఖమెత్తి-నేత్రములను మూసికొని, త్రికూటస్థానమందుదృష్టినిలిపిన-అది-అంతఃఖేచరియనియును, నేత్రములను దెరచి యీవిధముగానే చూచినట్లాయెనా బహిః ఖేచరియనియును జెప్పంబడును.

ప్రశ్న. మధ్యమముద్రయనగా-ఎటువంటిది?

ఉత్త. సద్గురూక్త ప్రకారముగా కూర్చుండి అర్థోన్మీలితలోచనుండై, నాసిక మధ్యభాగమందు దృష్టినిల్పి నిటలమును జూచినట్లాయెనా-అదిమధ్యమ ముద్రయని చెప్పంబడును.

ప్రశ్న. షణ్ముఖియనగా-ఎటువంటిది?

ఉత్త. సద్గురూక్త ప్రకారముగా నియమముతో కూర్చుండి శ్రవణ ద్వయంబును, నేత్రద్వయంబును, నాసికాద్వయంబును, వదం గుళములచేమూసి, త్రివేణి సంగమంబున దృష్టినిల్పిచూచి-ఆ నందించుట యేదిగలదో, అదియే-షణ్ముఖి యనఁబడును.

ప్రశ్న. శాంభవీ ముద్రయనగా-ఎటువంటిది?

ఉత్త. ఎడమకాలి మడిమను గుదస్థానమునందు చేర్చి, కుడికాలిమడి మను తొడచిక్కసంములో నుంచుకొని, తొడలయందు చే. తులు బూన్చుకొని, నడుమును ఐక్కగానిక్కి, ప్రాణాపానము లను యొకటిగాజేర్చి, మానసను త్రికూటస్థానమందుచిక్కబట్టి చూచి-ఆనందించుటే-శాంభవీముద్ర యనంబడును.

ప్రశ్న. అయితే యీయోగ ముద్రలను సాధించినందున ఫలమేమి?

ఉత్త. ఇంతప్రయాసజెంది యీయోగములను సాధించినందున, చంచ లయుక్తమయిన మనస్సును నిశ్చలపఱచుటకున్ను, గుఱ్ఱముల వలె పరుగెత్తెడు యింద్రియములను స్వాధీనపఱచుకొనుటకు న్ను సాధనమయ్యేను. అవియెటువలెనంటె ॥సమ్మతం॥ నాగస్వ రము వాడిపామును బట్టినట్టున్ను, మచ్చాలుమేపి పక్షులను బట్టి నట్టున్ను, మాంసము కనుపరచి డేగనుబట్టినట్టున్ను, ఎఱ్ఱనుగను పరచి చేపను బట్టినట్టున్ను, మనస్సునున్ను యింద్రియముల నున్ను జయించుటకు తగినసాధనములేగాని మోక్షప్రదములు గావు. ఇట్టియోగముసాధించుకొఱకై వాయుభక్షణ, జలభక్ష ణాది నియతాహారుడై జడలు ధరియించి, నారచీరలుగట్టి భూశ య్యగలవాడై శరీరమును మిక్కిలి క్షీణింపఁజేసి, అధికాయా సముజెంది సాధించినప్పటికి యీయోగమువల్ల అణిమాదిసి ద్ధులున్ను సాక్షిత్వపదవియును గలుగునుగాని, విదేహకైవ ల్యముప్రాప్తించదు । ఇందుకు సమ్మతం.

శ్లో॥ యోగినో రాగిణశ్చైవ భోగినస్త్యాగినస్తథా బ్రహ్మజ్ఞానం వినా

మోక్షం ఇతి వేదాంత డిండిమః। అనియున్నది.

ప్రశ్న. అయితే స్వామీ! ఇంత శ్రమజెంది యోగాదులనభ్యసించినందు నలోకరంజనమైన, అణిమాదిసిద్ధులున్ను, పునర్జన్మ రాహిత్య ముగలుగని-సాష్టిసాత్వపదవియే-ప్రాప్తించుననీ సెలవిచ్చితిరిగదా-వాటివల్లనేమి ప్రయోజనము. కనుక జన్మరాహిత్య కారియైన జ్ఞానమార్గము నుపదేశించి కృతార్థునిగాఁజేయవలయును, అనిప్రార్థించగా సద్గురుండానతిచ్చుచున్నాడు?

ఉత్త. బిడ్డా! జ్ఞానము లభించుటకు గాను ఆత్మానాత్మ విచారణ సేయవలయును.

## జ్ఞానమార్గము.

ప్రశ్న స్వామీ! ఆత్మనాత్మ విచారణ సేయవలయునని- ఆజ్ఞయిచ్చితిరి గదా? దానిని బోధించినన్ను కృతార్థునిగాఁజేయగోరెదను?

ఉత్త. బిడ్డా! ఆత్మానాత్మ విచారణ సేయుటకు సాధన చతుష్టయ సంపత్తికలవాడె-అధికారి.

ప్రశ్న. సాధనచతుష్టయ సంపత్తియనగా-ఎటువంటిది?

ఉత్త. నిత్యానిత్యవస్తు వివేకము-ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమాధిషట్కమ సంపత్తియు - ముముక్షుత్వము, అనినాలుగు విధములు.

ప్రశ్న. నిత్యానిత్యవస్తు వివేకమనగా-ఎటువంటిది?

ఉత్త. బ్రహ్మము సత్యమనియును, నామరూపాత్మకమైన యీప్రపంచము-అసత్యమనియును సద్గురువువలనం దెలుసుకోవడమే నిత్యానిత్యవస్తువివేకము.

ప్రశ్న. ఇహ ముత్రార్థ ఫలభోగ విరాగమనగా-ఎటువంటిది?

ఉత్త. ఈప్రపంచమందు వనితాది భోగములతోఁ గూడుకొని గృహ కుటుంబ ధనధాన్య వస్తువుల యందును, స్వర్గ లోకమందలి-

అనిత్యములైన రంభాసంభోగాదుల యందును, గోరికలు లేక వమనమైనయన్నమునందును, మూత్రపురీషాదులయందును నెట్లులయిష్టముకలుగదో-అటువలెనే గోరికలులేక యుండుట.

ప్రశ్న. శమాదిషట్కము సంపత్తియనగా-ఎటువంటిది?

ఉత్త. శమమనియు, దమమనియు, ఉపరతియనియు, తితీక్షయనియు, సమాధానమనియు, శ్రద్ధయనియు, ఆరువిధములుగాగలది.

ప్రశ్న. శమమనగా-ఎటువంటి?

ఉత్త. మనస్సువేదాంత శ్రవణ వ్యతిరిక్తమైన విషయాదుల యందు పోవుచుండినను-అట్టిమనస్సును వాటినుండి మళ్లించి, వేదాంత శ్రవణాదులయందు నిలుపడమే-శమమని జెప్పంబడును.

ప్రశ్న. దమమనగా-ఎటువంటిది?

ఉత్త. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, వేదాంత శ్రవణవ్యతిరిక్తమైన విషయాదులకు పోవుచుండిన వాటిని మళ్లించి, శ్రవణాదులయందు నిలుపడమే-దమమని జెప్పంబడును.

ప్రశ్న. ఉపరతియనగా-ఎటువంటిది?

ఉత్త. సకల పాపకర్మములను మాని, సకల పుణ్యకర్మములను కర్తృత్వాభిమాన ఫలకాంక్షగాక, ఈశ్వరార్పణజేయుటయే. ఉపరతి యనంబడును.

ప్రశ్న. తితీక్షయనగా-ఎటువంటిది?

ఉత్త. ప్రారబ్ధముచేత-ఏకాలమునకు-ఏమిసంభవించునో అది అనుభవింపక తీరదని నిశ్చయించుకొని, సమస్తము పోయినప్పుడు వ్యసనమున్ను, సకలము వచ్చినప్పుడు సంతోషమున్ను లేక, సమ బుద్ధితోనుండుటయే-తితీక్షయనంబడును.

ప్రశ్న. సమాధానమనగా-ఎటువంటిది?

ఉత్త. పెద్దలవద్దజేరి వేదాంత శ్రవణము చేయుకాలంబున మనస్సునున్ను,ఇంద్రియములనున్ను, పూర్వవాసనలచే-వేదాంతశ్రవణ

వ్యతిరిక్తములయిన విషయాదులకు పోవుచుండిన వాటిని త్రిప్పి వేదాంత శ్రవణమందు నిలుపుటయే-సమాధానము.

ప్రశ్న. శ్రద్ధయనగా-ఎటువంటిది?

ఉత్త. వేదాంతవాక్యముల యందును, ఆచార్యస్వాములవారియందును, ఈశ్వరుని యందును, అధిక విశ్వాసముతో కూడియుండుటే-శ్రద్ధయనంబడును.

ప్రశ్న. ముముక్షుత్వమనగా-ఎటువంటిది?

ఉత్త. మోక్షమును దెలుసుకొని, దానిని పొందవలెననే మనస్సుతో గూడుకొనియుండుటే-మోక్షేచ్ఛయనంబడును.

ప్రశ్న. మోక్షేచ్ఛ-ఎన్ని విధములు?

ఉత్త. మందమోక్షేచ్ఛ యనియును, తీవ్రమోక్షేచ్ఛ యనియును రెండు విధములుగా గలవు.

ప్రశ్న. మందమోక్షేచ్ఛయనగా-ఎటువంటిది?

ఉత్త. మోక్షమునకు కావలసిన సాధనములను సంపాదించకనే, మోక్షముకావలెనని కోరుటే-మందమోక్షేచ్ఛ.

ప్రశ్న. తీవ్రమోక్షేచ్ఛయనగా-ఎటువంటిది?

ఉత్త. ఇల్లు చుట్టును గాలు నట్టిసమయములో, ఇంట్లోవుండె వాడు వెళ్లిపోవలెనని ప్రయత్నంచేసినట్టున్ను, అడవిలోత్రోవ దప్పిన వాడు మార్గమును కనుగొనవలయునని ప్రయత్నంచేసినట్టున్ను, పెద్దపులి తరిమినప్పుడు దానిచేత కరవబడకుండా తప్పించుకొనవలయునని ప్రయత్నము చేసినట్టున్ను, మార్గములో కృష్ణసర్పము కరవవచ్చినదానిని తప్పించుకొనవలయునని ప్రయత్నం చేసినట్టున్ను, దొంగలుతఱుముక వచ్చినయెడలతన ధనమువాండ్లకు చిక్కకుండునటుల ప్రయత్నం చేసినట్టున్ను, తీవ్రమోక్షేచ్ఛగలవాడు అతి తీవ్రమనస్సుతో మోక్షసాధనలను త్వరలో సంపాదించును. లోకమందు పైన చెప్పబడ్డ యుపద్రవ

ములన్నియు,నొక టొకటిగా లోకులకు సంప్రాప్తించును గాని, తీవ్రమోక్షేచ్ఛ గలవానికి మాత్రము ఇట్టి యుపద్రవములన్నియును ఏక కాలమందే సంభవించును.

ప్రశ్న. ఈయుపద్రవము లన్నియు తీవ్రమోక్షేచ్ఛ గలవానికి యేక కాలమందు యేతీరుగా సంభవించును?

ఉత్త. ఇల్లుకాలడమనగా-దేహమనేయిల్లును,తాపత్రయములనే-అగ్నితగిలి తపించడమే - ఇల్లు కాలడము, అడవిలో త్రోవ తప్పడమనగా-ఆత్మస్వరూపము తానని తెలియక, దేహేంద్రియాదులు నేను-అని-అనుకోవడమే-దారితప్పడము. పెద్దపులితరుముక రావడమనగా - దుర్విషయములను సంకల్పించే మనస్సే పులికరవరావడము.కృష్ణసర్పముకరవరావడమనగా విషయములయందు అత్యాశతోగూడియుండుటే-సర్పముకరవరావడము. దొంగలు తఱుముక రావడమనగా - అరిషడ్వర్గమనే చోరులు, తనవివేకమనేధనమును-అపహరింపవలయునని యుండుటయే-దొంగలుతఱుముకరావడము, ఇట్లు ఉపద్రవములన్ని యేకకాలమందు సంభవించగా-ఈయుపద్రవములను బోగొట్టెడు సద్గురుడు-ఎచ్చటనున్నాడో-ఇందుకు-ఏమేమి సాధనములు కావలయునో యని చింతించెడు వాని మనోవ్యాపారమునకు తీవ్రమోక్షేచ్ఛయని పేరు. ఈ నాలుగు సాధనములు కలవాడె - ఆత్మానాత్మ విచారణకు అధికారిగాని, అన్యుడుకాడు.

ప్రశ్న. అయితే-ఆత్మానాత్మ విచారణ సేయుటకు సాధన చతుష్టయములలో నిత్యానిత్య వస్తు వివేకము మాత్రమే చాలునా-లేక నాల్గు సాధనములు కావలెనా?

ఉత్త. ఒకసాధనము చాలదు, నాలుగు సాధనములు కావలెను, ఎందువల్లననగా-ఈలోకమునందు శాస్త్రవేత్తలు నిత్యానిత్య వస్తు వివేకముగలవారై యుండియును, జననమరణ హేతువులైన

కామ్యకర్మము లాచరించుచు, విషయాసక్తులయి యుందురు; గాన, వారలకు-అధికారము చాలదు.

ప్రశ్న. అయితే-అధికారికి రెండు సాధనములుండిన చాలునా?

ఉత్త. చాలవు-ఎందువల్లననగా-కొందఱు-ఋషీశ్వరులు రెండుసాధనములు గలవారై యుండిన్ని, కోపతాపాధికులై యితరులను శపియించుచు, శమములేనందున వారికి-అధికారము చాలదు.

ప్రశ్న. అయితేమూడు సాధనములుండిన-చాలునా?

ఉత్త. చాలదు. ఏలాగంటే-లోకమునందు కొందఱు సంసారమును వదలి జడలు ధరియించి కృష్ణాజినంబులం బూని, మిక్కిలిశాంతులై యొకరినియాచించక యోగులనే నామమును వహించిన పెద్దలు, నిత్యానిత్య వస్తువివేకమున్ను, ఇహాముత్రార్థఫల భోగవిరాగమున్ను, శమాదిషట్క-సంపత్తియున్ను, ఈమూడు సాధనములు గలవారలై యుండియును, వేదాంతశ్రవణప్రదేశమందు నిలువరు గనుక, వారికిన్ని-అధికారము చాలదు. కాబట్టి నాల్గుసాధనములు కలవారె - అధికారులు. ఈ సాధన చతుష్టయములు శరీరములవల్లనున్ను, వాక్కువల్లనున్ను, ఆచరింపఁదగినవి కావు. అవి మనోవ్యాపారములు గనుకవిషయాసక్తిలేనివారికి సులభముగా సిద్ధించును.

ప్రశ్న. శ్రవణమునకు ముందు సాధన చతుష్టయము లేనివారికి యేమిగతికలుగును?

ఉత్త. శ్రవణము-ఆకాలమందైనను గురువువల్ల సాధనచతుష్టయ సంపత్తితోకూడ పొందవలయును, అట్లా పొందని వారికి - అధికారము చాలదు.

ప్రశ్న. తాపత్రయములనగా-ఎటువంటివి?

ఉత్త. అధ్యాత్మికమనిన్ని, అధిభౌతికమనిన్ని, అధిదైవికమనిన్ని, మూడువిధములుగా గలవు.

ప్రశ్న. అధ్యాత్మిక తాపమనగా - ఎటువంటిది?

ఉత్త. ఆత్మను అధిష్ఠించుకొనివచ్చే-చెవిపోటు, కండ్లకలక, శీతజ్వరాదులు మొదలయిన యుపద్రవములకు-అధ్యాత్మికమని పేరు.

ప్రశ్న. అధిభౌతికమనగా-ఎటువంటిది?

ఉత్త. ఇతరభూతముల వల్లననగా-దొంగల వల్లనున్ను, క్రూరజంతువుల వల్లననగా-పులి మొదలయినవాట్ల వల్లనున్ను, పాముల వల్లనున్ను, తేళ్ల వల్లనున్ను వచ్చేటు-ఉపద్రవములకు-అధిభౌతిక తాపమనిపేరు.

ప్రశ్న. అధిదైవిక తాపమనగా-ఎటువంటిది?

ఉత్త. అధిదేవతలైన సూర్య, వాయు, వర్ష, అగ్ని మొదలగు వాటి వల్ల-అనగా-వర్షము వల్లనున్ను-వాయువు వల్లనున్ను. పిడుగుల వల్లనున్ను - ఎండల వల్లనున్ను వచ్చే ఉపద్రవములకు. అధిదైవిక తాపమని పేరు.

ప్రశ్న. అరిషడ్వర్గములనగా-ఎటువంటివి.

ఉత్త. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములని- ఆరువిధములుగా గలవు.

ప్రశ్న. కామమనగా-ఎటువంటిది?

ఉత్త. గృహ, గ్రామ, క్షేత్ర, ధన, ధాన్యములు, మిక్కిలిగా సంపాదించవలెననే, మనోవ్యాపారమునకు-కామమనఁబడును.

ప్రశ్న. క్రోధమనగా- ఎట్టిది.

ఉత్త. స్వార్జితధనాపహరణము, ఎవరిచేత చేయ బడునో-వానియందు ఆగ్రహము గలిగెడి, మనోవ్యాపారమునకు - క్రోధమని పేరు.

ప్రశ్న. లోభమనగా-ఎట్టిది?

ఉత్త. తాను సంపాదించిన ధనములో నొకకాసు-అయినను, ఇతరులకు యివ్వననెడు మనోవ్యాపారమునకు-లోభమనిపేరు.

ప్రశ్న. మోహమనగా-ఎటువంటిది?

ఉత్త. స్వార్జిత వస్తువాహనాదులను మిక్కిలి ప్రేమచేత పొరబాటు లేకుండా కాపాడునట్టి మనోవ్యాపారమునకు - మోహమని చెప్పంబడును.

ప్రశ్న మదమనగా-ఎటువంటిది?

ఉత్త. సకలసంపదల వలనగర్వించి మంచిచెడుగు తెలియకయుండెడి, మనోవ్యాపారము-మదమనంబడును.

ప్రశ్న. మాత్సర్యమనగా-ఎటువంటిది?

ఉత్త. ఇతరలుతనకంటె గొప్పగానుండిన యెడలవారిని జూచిసహించ లేని, మనోవ్యాపారమును-మాత్సర్యమని చెప్పఁబడును.

ప్రశ్న. స్వామీ! ఆత్మానాత్మవిచారణ సేయవలయునని సెలవిచ్చితిరి గదా-ఆత్మయనగా నెట్టిది, అనాత్మయనగానెట్టిది?

ఉత్త. ఆత్మయనగా-శరీరత్రయ విలక్షణుఁడు, అవస్థాత్రయసాక్షి, పంచకోశవ్యతిరిక్తుఁడు, చతుర్వింశతి తత్వాతీతుఁడు, సచ్చిదానంద స్వరూపుఁడు, నిత్యుఁడు, సత్యుఁడు, నిర్వికారుఁడు, నిర్వికల్పుఁడు, నిర్గుణుఁడు, శుద్ధుఁడు, నిత్యముక్తుడైన వాని - ఆత్మయని చెప్పఁబడును.

ప్రశ్న. స్వామీ! శరీరత్రయమనగా-ఎటువంటివి?

ఉత్త. శిష్యా! స్థూలమనియును, సూక్ష్మమనియును-కారణమనియును మూడువిధములుగా జెప్పంబడినవి.

ప్రశ్న. స్థూలశరీరమనగా-ఎటువంటిది?

ఉత్త. త్వక్కు, చర్మ, మాంస-రుధిర, మేధ, మజ్జ, అస్థి, అనే సప్త ధాతువులతో కూడియుండి నదియును, మాతాపితృల యొక్క శుక్లశోణితముల వలన పుట్టినదియును, కరచరణాద్యవయవములతో గూడుకొని స్తంభమువలె గనుపడుతూ నుండునదే-స్థూలశరీరము, ఇది పంచవింశతి తత్వములతో గూడినది.

ప్రశ్న. అయితే-స్థూల శరీరము, శుక్లశోణితములవల్ల పుట్టినదని చెప్పి

తిరిగవా, శుక్లశోణితములు దేనివలనం బుట్టినవి?
ఉత్త. శిష్యా! అన్నమువలనం బుట్టినవి.
ప్రశ్న. స్వామీ! అన్నము దేనివలనం బుట్టినది?
ఉత్త. ఓషధులవలనం బుట్టినది.
ప్రశ్న. ఓషధులు దేని వలనంబుట్టినవి?
ఉత్త. పృథివివలనం బుట్టినవి.
ప్రశ్న. పృథివి దేనివలనం బుట్టినది?
ఉత్త. జలమునందలి గంధతన్మాత్రంబుల వలనం బుట్టినది.
ప్రశ్న. జలము దేనివలనం బుట్టినది?
ఉత్త. అగ్నియందలి రసతన్మాత్రంబుల వలనంబుట్టినది.
ప్రశ్న. వాయువు దేనియందు బుట్టినది?
ఉత్త. ఆకాశమునందలి స్పర్శతన్మాత్రంబుల వలనంబుట్టినది.
ప్రశ్న. ఆకాశము-ఎట్లాపుట్టినది?
ఉత్త. శబ్దంబువలనం బుట్టినది.
ప్రశ్న. శబ్దము-ఎట్లాపుట్టినది?
ఉత్త. ఓంకారమువలనంబుట్టినది.

అట్టి ఓంకారమువల్ల అకార, ఉకార, మకారములనెడు, మూడు మాత్రృకలుగలిగినవి. వాటిలో అకారమాత్రృకవలన రజోగుణ యుక్తుడైన బ్రహ్మపుట్టి సకలసృష్టికి కారణుండాయెను. ఉకార మాత్రృకవలన సత్వగుణ యుక్తుడయిన విష్ణువుపుట్టి సర్వపోషణకర్తయయ్యెను. మకారమాత్రృకవలన తమోయుక్తుడైన శివుండుపుట్టి సర్వవిలయకర్తయయ్యెను.

ప్రశ్న. అయితే-అట్టి-ఓంకారము యెట్లా పుట్టెను?
ఉత్త. మాయాశబలిత బ్రహ్మవలన పుట్టినది.
ప్రశ్న. మాయాశబలిత బ్రహ్మ యెట్లు గలిగెను?
ఉత్త. సత్వగుణప్రధానమైన మాయయందు, నిజాంశమైన-ఈశ్వరుండు

ప్రతిఫలించినందున, మాయాశబలిత బ్రహ్మ యయ్యెను.

ప్రశ్న. సత్వగుణ ప్రధానమయిన మాయ-ఎట్టుల-పుట్టినది?

ఉత్త. అహంకారంబు వలన త్రిగుణాత్మకంబై కలిగెను.

ప్రశ్న. అహంకారం బెటుల పుట్టినది?

ఉత్త. మహాత్తత్వము వలనంబుట్టినది.

ప్రశ్న. మహాత్తత్వము -ఎటుల పుట్టినది?

ఉత్త. మూలప్రకృతి వలనం బుట్టినది.

ప్రశ్న. మూలప్రకృతి యెటుల పుట్టినది?

ఉత్త. అనాదినిర్వికల్ప పరబ్రహ్మమునందు లీనమైయున్నది - ఏలాగంటె-దీపముక్రింది నీడవలెనే యున్నది గనుక, ఈవిధముగా పంచ భూతాత్మికమై, పంచవింశతి తత్వములతో గూడికొని యున్నదే-స్థూలశరీరము.

ప్రశ్న. స్థూలశరీరము పంచవింశతి తత్వములతో కూడినదని చెప్పితిరి గదా. పంచవింశతి తత్వములనగా-ఎటువంటివి?

ఉత్త. శ్రోత్ర, త్వక్, చక్షు-జిహ్వ - ఘ్రాణములనే జ్ఞానేంద్రియము లయిదున్ను - వాక్పాణి పాద పాయూప స్థలనెడు కర్మేంద్రియంబులైదున్ను, జ్ఞానమనోబుద్ధి చిత్త అహంకారంబులని యెదు, అంతరింద్రియంబు లైదున్ను, శబ్దస్పర్శరూపరసగన్ధంబులనియెదు విషయేన్ద్రియంబు లైదున్ను, ప్రాణము అపానము వ్యానము ఉదానము, సమానములనెడు, ప్రాణేంద్రియంబు లైదున్ను గూడి, పంచవింశతి తత్వంబులయ్యె.

ప్రశ్న. సూక్ష్మదేహమనగా-ఎటువంటిది?

ఉత్త. జ్ఞానేంద్రియంబు లైదున్ను,కర్మేన్ద్రియంబు లైదున్ను,ప్రాణము లైదున్ను, మనస్సుచిత్తముకూడి వకటిన్ని, బుద్ధిఅహంకారము గూడివకటిన్ని, మనోబుద్ధులనే రెంటితో గూటి పదిమేడుతత్వములతో గూడిన దె-సూక్ష్మశరీరము, దీని కేలింగ శరీరమని పేరు.

ప్రశ్న. కారణశరీరమనగా-ఎటువంటిది?

ఉత్త. మలినసత్వరజస్తమో గుణాత్మికమైన, అవిద్యే-కారణ శరీరము. సంకల్ప వికల్పాత్మికమైన హితము నిర్మలమై, జ్ఞానముతో కూడినది - కారణదేహము.

ప్రశ్న. అవస్థాత్రయమనగా-ఎటువంటివి?

ఉత్త. జాగ్రదవస్థయనియు, స్వప్నావస్థయనియు, సుషుప్త్యవస్థ యనియు మూడువిధములుగా గలవి.

ప్రశ్న. జాగ్రదవస్థయనగా - ఎటువంటిది?

ఉత్త. ఇంద్రియంబులచేత, వెలుపలవుండే వస్తువులను గుర్తెఱుగడమే జాగ్రతవస్థ, దీనికి అభిమాని విశ్వుఁడు.

ప్రశ్న. స్వప్నావస్థయనగా-ఎటువంటిది?

ఉత్త. జాగ్రదవస్థయందు, అను భవించిన పదార్ధములను అనుభవించని పదార్థములను మనస్సు విషయాకారముగా పరిణమించి యెంత పర్యంతము గుర్తెఱుగుచున్నదో అంతపర్యంతము స్వప్నావస్థయనం బడును. దీనికి-అభిమాని-తైజసుడు,

ప్రశ్న. సుషుప్త్యవస్థయనగా-ఎటువంటిది?

ఉత్త. ఇంద్రియములున్ను మనస్సున్ను బుద్ధిలో లీనమైయుండగా, బుద్ధికారణాద్యాకారముగానెంత పర్యంతముండునో, అంత పర్యంతము సుషుప్త్యవస్థ యనంబడును, దీనికి అభిమాని - ప్రాజ్ఞుఁడు.

ప్రశ్న. పంచకోశములనగా-ఎటువంటివి?

ఉత్త. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయములని, అయిదువిధములు.

ప్రశ్న. అన్నమయకోశమనగా-ఎటువంటిది?

ఉత్త. సప్తధాతువులలోకూడినదై, కరచరణాద్యవయవములతో సంభమువలెకనుపడె స్థూలదేహమే-అన్నమయకోశమనంబడును

ప్రశ్న. ప్రాణమయకోశమనగా-ఎటువంటిది?

ఉత్త. ప్రాణము లైదున్ను, కర్మేంద్రియము లైదున్ను, కూడుకొని యుండునదే-ప్రాణమయకోశము.

ప్రశ్న. మనోమయకోశమనగా - ఎటువంటిది?

ఉత్త. జ్ఞానేంద్రియము లైదున్ను, మనస్సున్ను గూడినదే-మనోమయ కోశము.

ప్రశ్న. విజ్ఞానమయ కోశమనగా - ఎటువంటిది?

ఉత్త. జ్ఞానేంద్రియము లైదున్ను, బుద్ధిన్ని గూడినదే. విజ్ఞానమయ కోశము.

ప్రశ్న. ఆనందమయకోశమనగా-ఎటువంటిది?

ఉత్త. మలిన సత్వరజస్తమోగుణాత్మకమైన-అవిద్యయే-ఆనందమయ కోశము.

ప్రశ్న. వీటికి కోశములని పేరు-ఎందుకువచ్చినది?

ఉత్త. ఆత్మను యెఱుగనీయక. కోశములవలె కప్పఁబడుచున్నవి గనుక కోశములని పేరువచ్చినవి, అది యెట్లాగంటె, చింతపండుకు మీద గుల్లకప్పుకొనియున్నట్టు. ఆత్మనుకోశములు గప్పఁబడి యుండును.

ప్రశ్న. అయితే శరీర త్రయమునకున్ను, కోశములకున్ను, ఏర్పాటులు గలవా?

ఉత్త. శరీరత్రయమే-పంచకోశములై యున్నవి, ఎట్లనిన, స్థూలశరీర మే-అన్నమయకోశము, కారణ శరీరమే-ఆనందమయకోశము, సూక్ష్మశరీరమే-ప్రాణమయ-మనోమయ - విజ్ఞానమయకోశము లై యున్నవిగాని, శరీరములువేరుగాను, కోశములు వేరుగాను యుండలేదు.

ప్రశ్న. చతుర్వింశతి తత్వములనగా-ఎటువంటివి.

ఉత్త. జ్ఞానేంద్రియములైదును, కర్మేంద్రియములైదును, ప్రాణము

లైదును, విషయాదులైదును, అంతఃకరణ చతుష్టయమున్ను గూడి, చతుర్వింశతి తత్వములనఁబడును.

ప్రశ్న. సచ్చిదానందస్వరూపుఁడనగా-ఎటువంటివాడు?

ఉత్త. సత్తు, చిత్తు, ఆనందము, అనెడు మూడులక్షణములు గలవాఁడు.

ప్రశ్న. సత్స్వరూపుఁడనఁగా-ఎటువంటివాఁడు?

ఉత్త. ఏవస్తువుచేతనున్ను బాధింపఁబడక, భూత భవిష్యత్కాలముల యందు, ఏకరూపముగానున్నవాఁడు.

ప్రశ్న. చిత్స్వరూపుఁడనఁగా-ఎటువంటివాఁడు.

ఉత్త. తనకుతానే ప్రకాశించెడువాఁడు.

ప్రశ్న. ఆనందస్వరూపుఁడనగా- ఎటువంటివాఁడు?

ఉత్త. దేహేంద్రియాదులు నేను గానని, పరిపూర్ణముగాను తెలివిగా నుయుండే-ఆత్మస్వరూపము నేను-అని తెలుసుకొనెడు వాఁడు.

ప్రశ్న. నిత్యుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉత్త. నాశనరహితుఁడు గనుక నిత్యుఁడు.

ప్రశ్న. సత్యుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉత్త. అసత్యమైన ప్రపంచము, కాలత్రయములయందు కానివాఁడు.

ప్రశ్న. నిర్వికారుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉత్త. షోడశవికారస్వరూపుఁడైన, సూక్ష్మశరీరము లేనివాఁడు గనుక నిర్వికారుఁడని చెప్పఁబడును.

ప్రశ్న. నిర్వికల్పుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉత్త. మనస్సులేదు గనుక, సంకల్పవికల్పములు లేని వాఁడు.

ప్రశ్న. నిర్గుణుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉత్త. బుద్ధియను వృత్తిలేదుగనుక, నిర్గుణుఁడనిచెప్పఁబడును.

ప్రశ్న. శుద్ధుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉత్త. మాలిన్యరహితుఁడు.

ప్రశ్న. నిత్యముక్తుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉ త్త. సంసారాదిబంధములు లేనివాఁడు.

ప్రశ్న. అసంగుఁడనగా-ఎటువంటివాఁడు?

ఉ త్త. సంగరహితుఁడు.

ప్రశ్న. అనాత్మయనగా-ఎట్టిది?

ఉ త్త. శరీరత్రయమున్ను, పంచకోశములున్ను, చతుర్వింశతి తత్వాములున్ను. అనాత్మయని చెప్పఁబడును.

ప్రశ్న. అనాత్మయనగా-ఇంకా ఎటువంటిది?

ఉ త్త. అనృతదుఃఖజడాత్మికమైనది.

ప్రశ్న. పైన చెప్పఁబడిన, ఆత్మయొక్క స్వరూపమును - ఎటులనెఱుంగవచ్చును?

ఉ త్త. లోకమునందు బియ్యము కావలశినవారు, వడ్లుదంచి పొట్టు తవుడు పరిహరించి బియ్యము నెటుల గ్రహించుచున్నారో - ఆ ప్రకారమే పంచకోశములవల్ల కప్పఁబడిన, ఆత్మను- సద్గురూపదేశమను శాస్త్రదృష్టమును, స్వానుభవమును, అనునీమూడు సాధనములచేతను, పంచకోశవ్యతిరిక్తుఁడైన, ఆత్మను గుర్తెఱుగ వచ్చును.

ప్రశ్న. పంచకోశములతో గూడిన శరీరమందు పంచకోశవ్యతిరిక్తుఁడైన - ఆత్మ యెటువలె నున్నాఁడు?

ఉ త్త. ఆత్మ దేహమందుండియును, దేహేంద్రియాదులు చేసెడుకార్యములకు కర్తగాకుండా, సాక్షీభూతుఁడై యున్నాడు. అదియెటువలెననిన, ప్రభువు తనకోటలోపలనుండిన్ని, తన ప్రధానులున్ను తక్కినజనులున్ను జేయునట్టిపనులను సాక్షియైయేలాగున జూచుచున్నాడో, ఆలాగుననే, దేహేంద్రియాదులు జేయుకార్యములకు వేరుగానుండియును, ఆత్మ సాక్షీభూతుఁడై చూచుచున్నాఁడు. అయితె-ఆదేహేంద్రియాదులుచేయుకార్యములను జూచి, ఈకార్యములను-ఆత్మ జేయుచున్నాడని కొందఱు అజ్ఞా

నులు భ్రమించుచున్నారుగాని అదిసత్యముకాదు. ఏలాగంటె-చంద్రుండు పరుగిడనివాడై యుండినను, వాయు వశము చేత మేఘములు పరుగిడుచుండగా, ఆసమయమున చంద్రుండు పరుగిడినట్లుగా, భ్రమయేలాగున కలుగుచున్నదో, ఆలాగున నున్ను, ఓడ నీళ్లయందు మహావేగముగా వెళ్లుతూవుండే సమయములో, నీటిదరియందుండెడు వృక్షములు కదలకుండా నుండియును, వృక్షములు పరుగెత్తునట్లుగా, చిత్తవిభ్రమము-ఏలాగున కలుగుచున్నదో, ఆలాగుననే, దేహేంద్రియాదులు సర్వకార్యములను జేయుచుండగా, దేహేంద్రియాదులచేతం గప్పంబడిన, ఆత్మసమస్తకార్యములనుజేయుచున్నదనే భ్రమ-అజ్ఞానముచేత గలుగుచున్నదిగాని, నిజముకాదు. ఇదియునుంగాక, ఆత్మయందు చంచలభావమున్ను గలదని, కొందఱు-అజ్ఞానులు చెప్పుదురు; అదియును నిజముకాదు. ఎట్లంటే, నీటిలో ప్రతిబింబించిన చంద్రబింబము నీళ్లు చెలించినప్పుడు, ఆప్రతిబింబమున్ను చలించినట్టు భ్రమదోచుచుండగా, చలించని చంద్రుడు చలించుచున్నాడని, అజ్ఞాను లెట్లుభావింతురో, అటువలెనే చంచలములేని, ఆత్మయందు అంతఃకరణనిష్ఠమైన చాంచల్యముగలదని, అజ్ఞానులు భావింతురేకాని, అది నిజముకాదు.

ప్రశ్న. అయితే, మనోబుద్ధిచిత్తాహంకారములు-ఆత్మయొక్క సమీపమందుండియును, ఆత్మను గుర్తెఱుగకుండుటకు కారణమేమి?

ఉత్త. దీపము గృహమునందుండెడు సమస్తవస్తువులను ప్రకాశింపంజేయుచున్నదైనను, ఆవస్తువులకు మిక్కిలి సమీపమందున్నదైనను, జడములైన ఆవస్తువులు ఆదీపమును యెటుల గుర్తెఱుగవో-అటువలెనే, జడములైన బుద్ధి మొదలగునవి ఆత్మను గనుగొనజాలవు. ఆత్మజ్ఞానస్వరూపుండై సర్వదా ప్రకాశుండై యున్నాడు. కనుక అట్టిఆత్మనుగుర్తెఱుగుటకుమరియొకజ్ఞానము

కావలసినదిలేదు. ఎటువలెననఁగా, ఒకదీపమునుగనుగొనుటకు, మరియొకదీపముకావలసినపని యెట్లులేదో, అటువలెనే యని తెలియవలెను గనుక, ఈవిధముగా శ్రవణమనననిదిధ్యాసముల చేత ఆత్మను గుర్తెఱిగినవారలే జ్ఞానులనిచెప్పఁబడుదురు. ఇట్టి జ్ఞానులే మోక్షార్హులు. జ్ఞానహీనులై, అనేక బ్రహ్మకల్పములు మోక్షాపేక్షచే యెన్ని ప్రయత్నములు చేసినప్పటికిని మోక్షము గలుగదు. ఇందుకు సమ్మతము ॥ "జ్ఞానాన్మోక్షః" అనియున్నది. "జ్ఞానంవినామోక్షోనసిధ్యతి" అనియును. శృతివాక్యములు గనుక, జ్ఞానము వల్లనే మోక్షసిద్ధిగలుగును. మోక్షేచ్ఛగలవారు, జ్ఞానా ధ్యానము ముఖ్యముగా చేయవలయును అట్టి జ్ఞానాభ్యాసముగలవారు, అసంగవృత్తి గలవారని చెప్పఁబడుదురు.

ప్రశ్న. జ్ఞానులైనవారున్ను సమస్తలోకవ్యవహారములను-జేయుచున్న వారలై యుండగా, అసంగులని యెటుల చెప్పవచ్చును?

ఉత్త. శ్రవణ, మనన, నిధిధ్యాసములచేతను, గురువాక్యమువలనను, శాస్త్రదృష్టమువలనను, ఆత్మనిశ్చయమువలనను, తానే కేవలాత్మగాగుర్తెఱిగి, అనాత్మస్వరూపములైనశరీరము-మనస్సుప్రాణములున్ను తానుగానన్న నిశ్చయమెఱిఁగినందున, శరీరధర్మములయిన జననమరణములున్ను, మనోధర్మములైన సుఖదుఃఖములున్ను, ప్రాణధర్మములైన క్షుత్పిపాసలున్ను, నేనుగుర్తెఱుగనని చెప్పుట యేమియాశ్చర్యము, ఎట్లనిన, విననివాడును, కననివాడును, అననివాడును, స్పృశించనివాడును. ఆఘ్రాణించనివాడునునైన, కేవలాత్మ తానేయను నిశ్చయముగలవాడు సమస్తలోక వ్యవహారములు చేయుచున్నవాడైనప్పటికిని, ఆకార్యములు తానుచేయుచున్నాననిగాని, అందుకు తాను కర్తననిగాని చెప్పడు, నిశ్చయముగా భ్రాంతినింబొందడు గనుక

సంగరహితుఁడనుటకు సందేహము లేదు. మఱియు స్త్రీవేష ధారియైనపురుషుఁడు, తానుపురుషుఁడనేగాని, స్త్రీనికానని. తననిజమును తానెఱిగి యుండుటచేత, అతను కనుపరిచే స్త్రీవిరహాదినటనలు, అతనికెట్లుజెందవో, అలాగే, కేవలాత్మ తానని గుర్తెఱిగినవాఁడు, తానుకాని దేహేంద్రియాదులద్వారా కృత వ్యాపారములచేత, తననిస్సంగత్వమునకు హానికలుగునని భ్రమించఁడు, (ఉపమానమునందు) స్త్రీవేషముధరించక పూర్వమునుధరించి నటించుచున్నపుడును, ఆవేషము విడిచినపుడును యీత్రికాలములయందును, వానిపురుషత్వమునకు - ఎట్లుభంగము కలుగలేదో, అలాగే, వేత్త- తనయింద్రియమనంబులు చెల్లించక పూర్వమును, చెల్లించు చున్నప్పుడును, నిలిచినప్పుడును, నిశ్చలుడే, నిస్సంగుడే, అయ్యేయున్నాఁడు.

ప్రశ్న. ఇటుల లోకవ్యవహారము లాచరించినవారలైయుండియు మోక్షమునుబొందినవార లెవరైనాకలరా?

ఉత్త. అట్టివారలు అనేకులుగలరు, వారలలోకొందఱిని జెప్పుచున్నాను, వారలెవరంటే; వసిష్ఠమహాఋషి పుత్రమిత్రకళత్రాదుల తో గూడినవాడయ్యును, జ్ఞానులలో శ్రేష్ఠుడనిపించుకొనెను. జనకమహారాజు రాజ్యభారమునువహించి దుష్టనిగ్రహ, శిష్టపరిపాలనజేసినవాడయ్యును, జ్ఞానులలో నగ్రేసరుం డనిపించుకొనెను. తులాధారుఁడు వాణిజ్యవృత్తిచే జీవించినవాడయ్యును, జ్ఞానులలోనుత్తముండనిపించుకొనెను. ధర్మవ్యాధుఁడు కటికవృత్తిచే జీవించినవాడయ్యును, జ్ఞానులలో ప్రసిద్ధిగాంచెను. కనుక జ్ఞానులు ప్రారబ్ధవశముచేత నెటువంటి వ్యవహారములాచరించినను, వారల జీవన్ముక్తులనుటకు సంశయములేదు.

ప్రశ్న. ప్రారబ్ధమొక్కటే, జ్ఞానులుకూడా అనుభవించవలసినదిగా చెప్పితిరిగదా, ఆగామిసంచితములు యేమయ్యెను?

ఉత్త. జ్ఞానోదయముకాగానే, అజ్ఞానమునశించును. అజ్ఞానము నశించగానే, అజ్ఞానసంబంధములగు సంచితములన్నియు నశించును. ఆగామి కర్మలు యెటులనశించుననంటే- జ్ఞానియయిన తర్వాత, అతనుచేయుపుణ్యాపాపములు అకర్తయయిన అతనింజెందవు. అతనింభూషించినవారలకు పుణ్యములున్ను, అతనిందూషించినవారలకు పాపములున్ను జెందుచున్నవి. ఇందుకుసమ్మతము॥ శ్లో॥ ప్రారబ్ధంభోగతోనశ్యే । త్తత్వజ్ఞానేననించితం । ఆగామి ద్వివిధంకర్మ । తద్ద్వేషిప్రియవాదినాం ॥ అనియున్నది గనుక అట్టి జ్ఞానులు విదేహకైవల్యమును బొందుదురు. వారలకేజన్మరాహిత్యము-ఇంకు సమ్మతము॥ "శ్లో॥ అగ్నిదగ్ధం యధాబీజం। శాఖాపల్లవవర్జితం।జ్ఞానదగ్ధంతథాయోగీ। పునర్జన్మనవిద్యతే॥" అనియున్నదిగనుక, జ్ఞానులైన వారలకు, జ్ఞానోదయముకాగానే-ఆగామి సంచితములు నశించునుగాని, ప్రారబ్ధము మాత్రము అనుభవించక తీరదుగనుక, జ్ఞానులైనప్పటికి, ప్రారబ్ధవశముచేత యెటువంటి వ్యవహారములు జేసినను వారలకు యేదోషమున్ను-అంటదు.

ప్రశ్న. అయితే, అట్లు-జ్ఞానులు సమస్తకర్మ లాచరించుచుండగా కర్మానుభవము వారలనెటుల పొందదు?

ఉత్త. అదియెటువలెననంటే-తామర - నీళ్లయందు పుట్టినదైనను-ఎల్లప్పుడు నీళ్లయందే యున్నదైనను, తామరాకుయందు యెటుల నీరు అంటదో, అటువలెనున్ను, జిహ్వాయందు నెయ్యిమొదలయిన పదార్ధములు యెటులనంటవో, అటువలెనున్ను, చల్లలో వెన్నయెటుల కలియదో, అటువలెనున్ను, కుమ్మరపురుగు బురదయందు తిరిగినప్పటికిన్ని ఆబురుదయెటుల నంటదో-అటువలెనున్ను, గచ్చకాయయందు బూడిదయెటుల నంటదో, అటువలెనున్ను, చింతగుల్లకు చింతపండు యెటులనంటదో,

అటువలెనున్ను. జ్ఞానులైనవారలు లోకవ్యవహార సంబంధ ములతో గూడికొనిన వారలైనప్పటికిన్ని వారలకు యేవిధ మైన దోషములున్ను అంటవు.

ప్రశ్న. బ్రాహ్మణులే మోక్షార్హులని చెప్పుచురు, నాకు తమబోధవలన జ్ఞానులకు తప్పయితరులకు మోక్షములేదని దృఢమైనది. బ్రాహ్మణ భావంబెటువంటిదో. ఆనతియ్యవలెను?

ఉత్త. బ్రహ్మభావముగలవారె బ్రాహ్మణులు, వారలుయెంటువంటివార లంటే- లేనిశరీరములు యెన్నటికిలేవనే-దృఢముగలవారు, అతి శాంతులు. అనుకూలమనె - కులముగలవారు. ఉపదేశమనే- దేశముగలవారు. నిదానమనే-దానముగలవారు, సమ్మతమనె- మతముగలవారు, సర్వమిత్రత్వమనే-గోత్రముగలవారు. అంటి- అంటక యుండుటే - యింటిపేరుగలవారు. విదేహమనే-దేహ ముగలవారు, శాంతమనే - నడతగలవారు. అకర్తృత్వమే - క్రియగాగలవారు. క్షురాక్షరరహితత్వమనే-పేరుగలవారు. అచ లుడనే-గురువుగలవారు. బ్రాహ్మణత్వము-దేనిని - అవలంభిం చుకొనివచ్చినదో - మనము విచారించవలసినదిగాయున్నది.

౧. జీవుని, అవలంభించుకొని వచ్చినదని చెప్పుదామంటె-జీవుఁడు సమస్తశరీరములయందును - ఏకరూపముగా యున్నాడుగనుక సర్వజీవులకు బ్రాహ్మణులనే- పేరురావలెనుగదా - అటులగా లేదు కాబట్టి, బ్రాహ్మణత్వము జీవుని-అవలంభించు కొనివచ్చి నదని చెప్పటకూడదు.

౨. శరీరమును - అవలంభించుకొని వచ్చినదని చెప్పుదామంటే- బ్రాహ్మణాది చండాల పర్యంతమున్ను యుండే శరీరములన్ని యును- పాంచభౌతికములై ధర్మాధర్మములనుజేయుచు, జనన మరణాద్యవస్థలను బొందియున్నవి గనుక బ్రాహ్మణత్వము శరీర మును-అవలంభించి వచ్చినదని చెప్పకూడదు.

౩. బ్రాహ్మణుఁడు శ్వేతవర్ణముగలవాడనియును, క్షత్రియుఁడు రక్త వర్ణముగల వాడనియును, వైశ్యుఁడు పీతవర్ణము గలవాడని యును, శూద్రుఁడు నీలవర్ణము గలవాడనియును జెప్పఁబడి యున్నది గనుక శరీరకాంతిని-అవలంభించుకొని వచ్చినదని చెప్పుదామంటే-హూణులు, మ్లేచ్ఛులు, మిక్కిలి తెలుపును మెఱుపును గలవారలై యున్నారు. ఇంకా ఇతరులైన సర్వ జనులున్ను, ఇట్టికాంతిగలవారలై యున్నారు గనుక, ఇట్టికాంతి గలవారికందరికిన్ని బ్రాహ్మణత్వము రావలెనుగదా అటుల రాలేదు. శుక్లశోణితములవల్ల వచ్చినదై యున్నది గనుక బ్రా హ్మణత్వము దేహకాంతిని - అవలంభించి వచ్చినదని చెప్పకూ డదు. ఇంతేకాకుండా - శరీరమునకు బ్రాహ్మణత్వము వచ్చిన ట్టైతే - మరణాంతమునందు అట్టిశరీరమును కుమారునిచేత - అగ్నిసంస్కారము చేయఁబడుచున్నది. అందువలనకుమారునకు బ్రహ్మత్వదోషము రావలెను. ఆదోషమురాలేదు గనుక, అట్లు చెప్పకూడదు.

౪. శిఖాయజ్ఞోపవీతములను-అవలంభించు కొనివచ్చినదని చెప్పు దామంటే-శిఖాయజ్ఞోపవీతములు అన్యకులస్థులకున్ను గలవు గనుక, వారలకున్ను బ్రాహ్మణత్వము రావలెను-అటుల రాలే దు. కాబట్టి శిఖాయజ్ఞోపవీతముల నవలంభించి వచ్చినదని చెప్పకూడదు.

౫. తెలివిని అవలంభించి వచ్చినదని చెప్పుతామంటే- తెలివిసర్వ జనులకున్ను గలదు గనుక, సర్వజనులకున్ను బ్రాహ్మణత్వము రావలెనుగదా, అటులరాలేదు గనుక, తెలివిని-అవలంభించి వచ్చినదని చెప్పకూడదు.

౬. కర్మనవలంభించి వచ్చినదని చెప్పుదామంటే-ఆగామి, సంచిత ము, ప్రారబ్ధములనే కర్మలనుసర్వజనులు అనుభవించుచున్నారు.

గనుక సర్వ జనులకున్ను బ్రాహ్మణత్వము రావలెను అటుల రాలేదు. గనుక కర్మనవలంభించి వచ్చినదని చెప్పకూడదు.

౭. దానము నవలంభించి వచ్చినదని చెప్పుదామంటే - దానము సర్వజనులచేత చేయఁబడుచున్నది. రాజులచేత విశేషిలిగా చేయబడుచున్నది గనుక, సర్వజనులకు బ్రాహ్మణత్వము రావలె ను అటులరాలేదు గనుక, దానము నవలంభించి వచ్చినదని చెప్పకూడదు.

౮. కులము నవలంభించి వచ్చినదని చెప్పుదామంటే ఈబ్రాహ్మణు లని చెప్పేడు వారివంశమును గురించి విచారించగా-ఋష్య శృంగుఁడు మృగమునకుం బుట్టెను. కౌశికుఁడు దర్భయందు బుట్టెను. వాల్మీకి బోయకులమందు బుట్టెను వ్యాసుఁడు బెస్త దానికిం బుట్టెను - గౌతముఁడు లేడికిం బుట్టెను. వసిష్ఠుఁడు యూర్వశికింబుట్టెను. అగస్త్యుఁడు కలశములో బుట్టెను. జాంబ వంతుడునక్కకుంబుట్టెను. నారదుఁడు చాకలిదానికిం బుట్టెను గనుక, ఈవిధముగా తిర్యగ్జంతువులకున్ను, నీచజాతులకున్ను, జన్మించినవారికే-బ్రాహ్మణత్వము వచ్చినట్టైతే - మనుష్యజాతి యందు జన్మించిన వారికందరికిన్ని సాధారణముగా బ్రాహ్మ ణత్వము రాకుండుటకుకారణమేమి. గనుక, కులమునవలంభించి వచ్చినదని చెప్పకూడదు.

౯. ఎందువలన వచ్చినదంటే-బ్రహ్మజ్ఞానము నవలంభించి బ్రాహ్మ ణత్వము వచ్చినదేగాని, ఇతరకారణములవలన వచ్చినదికాదు. ఇందుకు సంశయములేదు. ఈవాక్యప్రమాణములు సత్యములు గాను వేదయుక్తములుగాను నమ్మవలెను. ॥దీనికి సమ్మతి॥ జన్మ నాజాయతే శూద్రః । కర్మణాజా యతేద్విజః । వేదపాఠంతు విప్రాణాం । బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః । అనియున్నది.

ప్రశ్న. అయితే, బ్రహ్మముఖమందు బ్రాహ్మణులును, బాహువులయందు

క్షత్రియులును, ఊరువులయందు వైశ్యులును, పాదములయందు శూద్రులును, పుట్టినట్లు చెప్పుదురు. ఆభావంబెటువంటిదో, ఆనతియ్యవలయును?

ఉత్త. ఈనామములు సాధారణముగా వృత్తులనవలంభించి వచ్చినవి గాని, పుట్టుకవలనరాలేదు. ఏలాగంటే, బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః, అనురీతిన, బ్రహ్మవిచారణ చేసినవారు బ్రాహ్మణులగుదురు. బ్రహ్మవిచారణ చేయవలెనని ఏగ్రంధమందుయున్నదంటే-వేదముల యందున్నది. అట్టివేదములను చదువుటకు, అట్టివారిని కొందఱిని, పూర్వీకులుగా నియమించి, వారికి యేర్పరిచిన వృత్తి యేమనగా - స్నాన - సంధ్యా వందన - జప-తప-హోమాదివిధులు చేయవలసినది గానున్ను, వేదశాస్త్రములు చదివివాటి-అర్థములు చక్కగా తెలుసుకొని యితరులకు ధర్మాధర్మములున్ను, పాపపుణ్యములున్ను, మోక్ష నరకములున్ను, మొదలుగాగల నీతిమార్గములన్నియు బోధించడమునకున్ను, యజన-యాజనా-ధ్యయనా-ధ్యాపన-దాన-ప్రతిగ్రహములనెడు, షట్కర్మలయందు నిరతులై తత్ఫలార్థమంత్రాత్ములై వాక్కువల్ల జీవించేవారు గనుకనున్ను. అట్టివాక్కు ముఖమందుండునది గనుకనున్ను, ముఖమువల్ల జీవించే వారనేకాని-ముఖమందు పుట్టినవారని జెప్పకూడదు. పూర్వీకులైన యిటువంటి వారు తమకు ఏకొఱతలులేకుండా జీవనములను జరుపుకొనుచు, తమకు సంభవించే - అపాయములను బోగొట్టుకొనుచు, చేయవలసిన కార్యములనుజక్కగా చేయని వారలను శిక్షించుచునున్నారు. అట్టికాలము లో భుక్తివిషయమై-లోపము లేనందువల్ల ముక్తి మార్గవిషయమైన బ్రహ్మవిచారణయే సేయుచుండిరి. ఇప్పుడు ఆవిధముగా భుక్తిజరిపేవారు లేరుగనుక వారలు బ్రహ్మవిచారణ వృత్తినివిడాని, భుక్తికొఱకై అనేకవ్యాపారములను జేయుచు

న్నారు గనుక, వారికి బ్రాహ్మణత్వము కలదని యెంతమాత్రమున్ను చెప్పకూడదు; బ్రహ్మాణాతీతి బ్రాహ్మణః అను-ఉత్పత్తివల్లనున్ను చెప్పకూడదు ॥స్మృతి॥ యోనధీత్య ద్విజో వేదాన్।యోన్యత్ర కురుతే ద్విజః।సజీవన్నేవ శూద్రత్వం॥ ఆశుగచ్ఛతి సాన్వయః॥ అని స్మృతి॥ ఇంతేకాకుండా వృత్తివల్ల కులమువచ్చినదని చెప్పుటకు యింకాకొన్ని దృష్టాంతరములను కలవు. గుడ్డలు ఉతుకుటవలన రజకుండనియు, క్షౌరము చేసి నందువల్ల క్షురకుండనియు, కుండలు చేయుటవలన కుంభకారుఁడనియు, గుడ్డలునేయుట వలన తంతువాయకుఁడనియు చెప్పుచున్నారు. ఇదియునుంగాక కంసాల కులములో-ఒకతండ్రికి కుమాళ్లు అయిదుగురు యున్నప్పుడు, వాండ్లుచేసెవృత్తినింబట్టి-ఇనుముపని చేసినందున కమ్మరబత్తుడనియు, కఱ్ఱపని చేసినందున వడ్ల బత్తుడనియు. రాతిపని చేసిన వానికి కాశీబత్తుడనియు, కంచు యిత్తడిపనులు చేసినందున కంచరబత్తుడనియు, బంగారుపనులు చేసినందున అగసాల బత్తుడనియును జెప్పుదురు. ఇంకాయితరములైన పనులు చేయు వారలకు అనేకములైన నామములు చెప్పుదురు. ఇటువంటి నామములు వృత్తులనవలంభించి వచ్చినవిగాని పుట్టుకవలన వచ్చినవి కావు. ఇందుకు సమ్మతము ॥ స్మృతి ॥ "చాతుర్వర్ణ్యం మయాసృష్టం। గుణకర్మవిభాగశః"॥ మరియొక దృష్టాంతమును గలదు. పనస వృక్షమునకు శాఖాగ్రమునందును, శాఖలకు మధ్యమందును మ్రానుమధ్యను. వేళ్లయందును, కాయలుపుట్టి పండ్లుపండినవి ఆపండ్లకు రూపభేదమున్ను, రుచిభేదమున్ను, నామభేదమున్ను లేదు. అవియన్నియు పనసపండ్లు అనే-చెప్పుదురు. అటువలె మనుష్యులందరున్ను, ఏకమైన బ్రహ్మవల్లనే పుట్టబడిన వారై యుండియు నామభేదములు రావడమునకు కారణమేమనగా-వృత్తివల్లవచ్చినవిగాని, పుట్టుకవల్లవచ్చినవి కావు. కనుక వీర

లను బ్రాహ్మణులనడము యెట్లావున్నదంటే- నేతిబీరకాయయ
న్నట్టున్ను బెల్లంకొండయన్నట్టున్ను, బంగారవుకొండయన్న
ట్టున్ను, సువర్ణముఖయన్నట్టున్నుయున్నది. వీటియందు వ్యవ
హారనామమేగాని-క్రియవల్ల -నెయ్యిన్ని, బెల్లమున్ను, బంగార
మున్ను కానము. అటువలెనే వీరలకున్ను,నామమూత్రమేకా
ని-క్రియవల్ల బ్రహ్మజ్ఞానముకొందఱియందుగానము. ఇంతేగాక
కొన్ని గ్రామములయందు వాడుకగా-యీగ్రామములో బ్రా
హ్మణయిండ్లు యెన్నియున్నవని విచారించితే - రెండుయిండ్లు-
ఉన్నవని చెప్పుదురు తరువాతవీధికి వెళ్లినప్పుడు, ఇవిబ్రాహ్మణ
యిండ్లవలెనున్నవి, ఇవియెవరియిండ్లు-అని- అడిగితే-ఇవి కరణ
ములయిండ్లు అనిచెప్పుదురు. గనుక, ఈనామము వీరలకుయెం
దుకు వచ్చినదంటే - కరిణీకవృత్తివల్ల వచ్చినదని స్పష్టముగా
తెలియబడుచున్నది. కనుక వృత్తివల్లవచ్చిన నామములేగాని,
పుట్టుకవల్లవచ్చినవికావు. క్షత్రియుల సంగతి ఆలోచించగా.
వారుబాహులయందు పుట్టినవారుకారు. బాహులవల్ల జీవిం
చేవారు గనుక, ఈపేరువచ్చినది. అస్త్రశస్త్రధారులై బాహు
బలపరాక్రమములచేత, జీవించెడివారుగనుకనున్ను, క్షతాత్త్రా
యతే - ఇతిక్షత్రియః । అను ఉత్పత్త్యనుసారముననున్ను, వారికి
బాహుబలముచే జీవించుట-కులధర్మము గనుకనున్ను, వృత్తి
వల్లవచ్చినదని చెప్పుటకు యెంతమాత్రమూ సంశయములేదు,
వైశ్యులసంగతి విచారించగా. ఊరువులయందు బుట్టినారనుట-
అబద్ధము ఎట్టులనగా, ఊరువులవలన జీవించేవారలై యున్నా
రు. ఎటులన్నను, ఊరువుల ఆధారముచేకూర్చుండి, వాణిజ్య
వృత్తిచే జీవించేవారలై యున్నారు. అందువలననే, (విశంతీతి
వైశ్యాః) అను అవయవార్థానుసారమున వైశ్యులనిన్ని, వర్త
కులనిన్ని, పేరువచ్చినది. ఇందుకు దృష్టాంతము లోకమంతు.

మొతదులగు జనులుకూడా వర్తకముచేసినప్పుడు, వారిని కూడా వర్తకులని పిలువబడుచున్నారు, గనుక, వృత్తివల్ల అట్టిపేరువచ్చి నదనుటకు సంశయమెంతమాత్రమున్ను లేదు. శూద్రులవిషయ మై ఆలోచించగా, పాదములయందుపుట్టినారని చెప్పుట-అబద్ధము. మఱియును-శూద్రులు, వ్యవసాయము మొదలగు పనులుచేయుటకు, పాదచారివృత్తికావలెను గనుక, అట్టి పాదచారి వృత్తిచే జీవించినందువలన, అట్టి పేరువచ్చినది గాని, పుట్టుకవల్లవచ్చినదికాదు. ఇందుకు దృష్టాంతము లోకములో యితరజనులున్ను వ్యవసాయము చేసినట్టైతే, వారలనున్ను శూద్రులనిన్ని - లేక రయితులనిన్ని - పిలుచుచున్నారు, దీనికి సమ్మతి॥ తస్మాత్పాదా ఉపజీవతః॥

టీక ॥ పూర్వోక్తకారణమువల్ల, మంచిశూద్రులు పాదముల వల్లనుండి జీవించవలసినది. వేదశాస్త్రములలో-అజ్ఞానమే శూద్రత్వమని తేటగా వ్రాయబడినది. దీనికి అనుకూలము గానే, పరమహంస స్వరూపులైన వేమన్నగారు మొదలగు కొందఱు యోగపురుషులు వ్రాసియున్నారు. శూద్రత్వము అజ్ఞానమును బట్టియు, అభిమానమునుబట్టియు, వచ్చినదని యీక్రింద వ్రాయబడినవాటివలన స్పష్టమగుచున్నది.

"శైవమతోద్ధారకుండైన బసవేశ్వరులవారు, లింగబలిజకులస్థుడైన చెన్నయ్యాగారియొద్ద కటాక్షమునుబొంది తీర్థప్రసాదములు పుచ్చుకొనిరి. అద్వైతమతోద్ధారకుండైన శంకరాచార్యులవారు, దూదేకులసిద్దప్పగారియొద్ద కటాక్షమునుబొంది, తీర్థప్రసాదములను పుచ్చుకొనిరి. రామానుజమతోద్ధారకుండైన రామానుజులవారు, పంచములైన మూరునూరి నంబిగారికిన్ని తిరుప్పణ్ణాళ్వారులవారికిన్ని, రెడ్డికులస్థుడైన నమ్మాళ్వారులవారికిన్ని, భక్తులై వారి కటాక్షమును బొంది తీర్థ ప్రసాదములు

పుచ్చుకొనిరి. హిందూమతోద్ధారకులగు యీ ముప్పురును, అజ్ఞానరహితులైన నిజమైన బ్రాహ్మణులు గనుకనె, కులభేదములు, జాతిభేదములు, అజ్ఞానమువలన వచ్చినవని తెలుసుకొనినవారలై, జాతిభేద, కులభేదములను యెంచక, అన్య కులస్థుల యొక్క తీర్థప్రసాదములను త్రికరణశుద్ధిగా గ్రహించిరి"॥ ఇదియునుంగాక బ్రాహ్మణ స్త్రీలు, అజ్ఞానముతో గూడుకొన్నవారు గనుకనే-శూద్రులని చెప్పఁబడిరి. ఇదియునుంగాక, శ్రీకృష్ణమూర్తి పంచమవేదమైన, భారతమునందు దుర్యోధనునకు చెప్పినవాక్యము విష్ణుభక్తి పరాయణుండైన మనుజుఁడు నాలవజాతియందు జన్మించినవాడైనను, పరమ భాగవతోత్తముండైన బ్రాహ్మణుండనంబరగు-అనియును - సకలజాతులయందు విష్ణుభక్తి లేనివాడు శూద్రుండనంబరగుననియును తేటపఱచియున్నారు. శ్రీభాగవతమందు-అమలజ్ఞానరహితుడును, షట్కర్మనిరతుఁడుననగు బ్రాహ్మణునికంటె- అమలజ్ఞానసహితుడైన శ్వపచుడు మేలు-అని మొరలిడుచున్నది. "జన్మనా జాయతే శూద్రః । అనిస్మృతి ॥ గనుకనే స్త్రీలును శూద్రులును, వేదములను వినకూడదనియును జదువకూడదనియును భారతమందును యజుర్వేదమందును చెప్పఁబడియున్నది. దీనికి సమ్మతి. స్మృతి ॥ "స్త్రీశూద్రబ్రహ్మబిన్ధూనాం త్రయీనశ్రుతిగోచరా" ॥ శ్రుతిః ॥ "న స్త్రీశూద్రా వేదమధీయతామ్" ॥ అనియున్నదిగనుక బ్రహ్మజ్ఞానముగలవారే బ్రాహ్మణులని చెప్పుటకు యేసందేహమున్ను లేదు, ఇది అనేకమార్లకుసత్యంసత్యం॥ ఇట్టివారే మోక్షార్హులు వ్యవహారత్వేన బ్రాహ్మణులుగానుండువారు, మోక్షార్హులుగారు. ఇదిసత్యము సత్యము. ఇందుకు సమ్మతముగా, సద్గురుమూర్తియు పరమహంసయునగు, పులహరిఫీరోజిగారివల్ల రచియింపఁబడిన యీక్రింద వ్రాయబడిన

ప్రశ్నో త్తరసంవాదమువల్ల తేటపడును?

పున్నాగవరాళము. – ఆటతాళము.

ధరణిలోపలను భూసురముఖ్యులనుజూచి । శరణుసేయనట్టి పరణియేమయ్యా । పీరుదాస । పీరుదాసా సుగుణవిలాస పీరుదాస ॥ పరమాత్మ తత్వతత్పరులైన, ఏజాతినరులైనవారికి శరణాధీనన్నా॥ లక్ష్మణాఖ్యా।లక్ష్మణాఖ్య । దాక్షిణ్యసఖ్యా-లక్ష్మణాఖ్య ॥ ౧ ॥ ధరనువర్ణా శ్రమధర్మాతి శయములు పరికింప వలసిన పద్ధతికాదా । పీరుదాస । అరయతృణాదివం । శరుహాగర్భాన్తమీ । శ్వరుడగునతనికి శరణాధీనన్నా॥ లక్ష్మణాఖ్యా ॥ ౨ ॥ గణుతింపబ్రాహ్మణాగ్రణులాగన్గొనిభువి । ప్రణుతింపవలెనన్న ఫణతియేమయ్యా ॥ పీరుదాస । అణుమాత్రమైనది । దాత్మనుగనువిచక్షణులెవ్వారైన బ్రాహ్మణులవుదురన్నా॥ లక్ష్మణాఖ్యా॥ 3 ॥ కరమొప్పవేదాధికారులైన భూసురులే ముఖ్యలని స్మరియింతురేమయ్యా ॥ పీరుదాసా ॥ అరయగనిగమాగమాంతవేత్తలయిన పరమసాధులు వంశకరులవుదురన్నా ॥ లక్ష్మణాఖ్యా ॥ ౪ ॥ భువిచాతుర్వర్ణ్య మానవులందునగ్ర । సంభవులే యోగ్యులని పల్కుటేమయ్యా । పీరుదాస । వివరింపకులమేమిస్తవనీయమయ్యె నెక్కువగుణయుతుని మక్కువసేతురన్నా ॥ లక్ష్మణాఖ్యా ॥ ౫ ॥ పరికింపసత్కర్మ నిరతులైయహింసా । పరులైనవారె భూసురులందు రేమయ్యా।పీరుదాసా। పరవిణశ్వపచుడైన హరిభక్తి జ్ఞానభానుడైన వాడగ్రేసరుడందురన్న ॥ లక్ష్మణాఖ్యా ॥ పరగవాజపేయ పౌండరీకాదుల । నెఱపువారలె ధరాసురులందు రేమయ్యా ॥ పీరుదాస ॥ నిరహంకృతిని । పరాత్పరభావ మొందిన । నరులనే బ్రహ్మవిద్వరులందురన్నా ॥లక్ష్మణాఖ్యా॥ ౭. ॥ గాయత్రీమంత్రశిఖోపవితోపాధ్యాయులేద్విజులని తలచుటేమయ్యా । పీరుదాసా ॥ హాయిన

దాజప।గాయత్రీమంత్ర విధేయుఁతా వాశేసు।ధీయుతులన్నా ॥ లక్ష్మణాఖ్యా ॥ ౭ ॥ జలజభవానన జలజనేంభవులని యిలలో విఖ్యాతిగ పలుకఁటేమయ్యా । వీరుదాసా ॥ పొలుపొందుకొ చ్చోటఁ । పొడముచుండు నాయాస్థలమే యోనిగనార్యుల్లలపో తురన్నా ॥ లక్ష్మణాఖ్యా ॥ ౮ ॥ భాసురభద్రాద్రి వాసుడైన శ్రీనివాసునిగలసేటి వాసులెవరయ్యా । వీరుదాసా । సుగుణావి కాస । వీరుదాస । వాసనరహితులై ధీసాక్షియగు సద్వికాసు నెఱిగినవారె దాసులవుదురన్నా ॥ లక్ష్మణాఖ్యా॥ దాక్షిణ్యాసఖ్యా॥ లక్ష్మణాఖ్యా ॥

బిడ్డా! ఇంద్రియాదులున్ను, వానిస్థానములున్ను, వాని అధిదే వతలున్ను, వానివిషయములున్ను, ఇవియన్నియు ఆత్మకాదని చెప్పుచున్నాను గనుక శ్రద్ధాసక్తుండవై వినుము.

౧. శ్రోత్రేంద్రియము - చెవులనే గోళాకారము నందుండి, లౌకిక వైదిక, శబ్దాదులనువినునది, వీనికి అధిదేవతలు దిక్కులు, ఇది ఆకాశగుణముగనుక, ఆత్మయనిచెప్పకూడదు.

౨. త్వగింద్రియము చర్మమందుండి, శీత ఉష్ణములను గ్రహిం చుచుండును. వీనికి వాయువు అధిదేవత, స్పర్శము వాయువు యొక్క గుణముగనుక, ఆత్మయని చెప్పగూడదు.

౩. చక్షురింద్రియము నల్లగుడ్డు మధ్యయందుండి, నానా రూపము లను చూచు చుండును, వీనికి అధిదేవత సూర్యుడు, రూపము అగ్ని గుణముగనుక, ఆత్మయని చెప్పగూడదు.

౪. జిహ్వేంద్రియము కొననాలుక యందుండి షడ్రసములను గ్ర హించుచుండును, వీనికి అధిదేవత వరుణుఁడు, ఇదిజలగుణము గనుక ఆత్మయని చెప్పగూడదు.

౫. ఘ్రాణేంద్రియము నాసికము నందుండి, సుగంధ దుర్గంధాదుల నాఘ్రాణించు చుండును, వీనికి-అధిదేవతలు-అశ్వినీ దేవతలు

ఇదిగంధవిషయము, ఇదిపృథ్వీ గుణముగనుక, ఆత్మయనిచెప్ప కూడదు.

౧. వాగింద్రియ మనునది-వాక్కు-యందుండి, నానాలౌకిక, వైదిక వాక్యములను వచించుచుండును. వీనికి-అధిదేవత-అగ్ని. ఇది ఆకాశగుణముగనుక, ఆత్మ - అని చెప్పగూడదు.

౨. పాణీంద్రియము చేతులయందుండి, ఇచ్చిపుచ్చుకునే-వ్యవహారములను జేయుచుండును. వీనికి-అధిదేవత-ఇంద్రుఁడు. ఇదివాయుగుణముగనుక. ఆత్మయని చెప్పగూడదు.

౩. పాదేంద్రియము కాళ్లయందుండి గమనాగమనములు చేయుచుండును, వీనికి, అధిదేవత-ఉపేంద్రుఁడు. ఇది - అగ్నిగుణముగనుక - ఆత్మ యనిచెప్ప గూడదు.

౪. ఉపస్థేంద్రియము లింగయోనియందుండి, శుక్లశోణిత మూత్ర విసర్జన-ఆనందములనుజేయుచుండును. వీనికి-అధిదేవత-బ్రహ్మ. ఇది జలగుణము గనుక ఆత్మ-అని చెప్పకూడదు.

౫. పాయురింద్రియము గుదస్థానమునందుండి మలవిసర్జనముల చేయుచుండును వీనికి అధిదేవత మృత్యువు. ఇది పృథివీగుణము గనుక-ఆత్మయనిచెప్పగూడదు.

౧. ప్రాణవాయువు ఇంద్రనీలవర్ణముగలిగి, హృదయమందుండి; శ్వాసనిశ్వాసములను జేయుచుండును.
వీనికి అధిదేవత విసృష్టుఁడు, ఈ ప్రాణవాయువు ప్రధానమైన సముదాయ పంచభూతగుణములలో నొకటి గనుక-ఆత్మయని చెప్పగూడదు.

౨. అపానము పీతవర్ణముగల్గి-గుదస్థానమందుండి, మూత్రపురీష విసర్జనములు చేయుచుండును. వీనికి-అధిదేవత విశ్వకర్త, ఈ అపానవాయువు ప్రధానమైన సముదాయ పంచభూతగుణములలో నొక్కటి గనుక-ఆత్మయని చెప్పకూడదు.

వ్యానవాయువు గోక్షీరవర్ణము కలిగి-సర్వశరీరమునందు వ్యాపించి, శీతోష్ణముల నెఱిగి శరీరమును కాపాడుచుండును. వీనికి అధిదేవత విజయుండు, వ్యానవాయువు ప్రధానమైన సముదాయ పంచభూతగుణములలో నొక్కటి గనుక - ఆత్మయని చెప్పకూడదు.

౪. ఉదానవాయువు మెఱుపు తీగెవర్ణము కలిగి-కంఠస్థానమందుండి, విచిత్రమైన లౌకిక వైదికవాక్యములను బలికింపజేయుచు, సుషుప్త్యవస్థయందు యింద్రియాదు లన్నింటిని తీసుకొని పోయి, అవిద్యలో కలుపుచు, జాగ్రదవస్థయందు వాటివాటి గోళాకారములయందుండి, వాటిని నిలుపుచు, మరణసమయమందు వీటినన్నిటినిలోకాంతరాళమునకుందీసుకపోవును. వీనికి అధిదేవత-విశ్వయోని, ఉదానవాయువు సముదాయపంచభూత గుణములలో నొకటి గనుక-ఆత్మయని చెప్పకూడదు.

౫. సమానవాయువు నీలవర్ణముకలిగి, నాభిస్థానమందుండి భక్షించిన పదార్థములసారములన్నిటిని డెబ్బదిరెండువేల నాళ్లకుపంచిపెట్టుచుండును. వీనికి అధిదేవత జయుఁడు. సమానవాయువు ప్రధానమైన సముదాయ పంచభూత గుణములలో నొక్కటి గనుక - ఆత్మయని చెప్పకూడదు.

౧. నాగవాయువు పీతవర్ణము గలిగి, గీత రాగాదులను జేయించుచు హృదయమందుండి వాంతిచేయుచుండును. వీనికి- అధిదేవత విశ్వుడు, ఇది ప్రాణవాయువునకు ఉపవాయువు గనుక-ఆత్మయని చెప్పకూడదు.

౨. కూర్మవాయువు- శ్వేతవర్ణము కలిగి-గుదస్థానమందుండి, నోరును కన్నులను మూయించుచు, తెరిపించుచుండును. వీనికి-అధిదేవత విశ్వకర్త. ఇది - అపానవాయువునకు ఉపవాయువు గనుక-ఆత్మయని చెప్పగూడదు.

3. కృకరవాయువు- రక్తవర్ణము కలిగి, నాసికాగ్రమునందుండి, తుమ్మించుచుండును. వీనికి అధిదేవత జయుండు. ఇది వ్యాన వాయువునకు ఉపవాయువు గనుక-ఆత్మయని చెప్పకూడదు.

౪. దేవదత్తవాయువు- స్ఫటికవర్ణముగలిగి, గుహ్యనేత్రస్థానముల యందుండి, ఆవలింతలు వచ్చునట్లుచేయుచుండును. వీనికి- అధిదేవత విశ్వయోని-ఇది-ఉదానవాయువునకు ఉపవాయువు గనుక- ఆత్మయని చెప్పకూడదు.

౫. ధనుంజయవాయువు-ఇంద్రనీలవర్ణముకలిగి, బ్రహ్మస్థానమందుండి కర్ణరంధ్రములలో దశవిధ నాదములను జేయుచు, మరణకాలమునకు ముందుగా నిర్ఘోషమయిపోవును, వీనికి- అధిదేవత జయుఁడు, ఇది సమానవాయువునకు ఉపవాయువు గనుక - ఆత్మయని చెప్పకూడదు.

౧. మనస్సు కంఠస్థానమందుండి- సంకల్పవికల్పములను జేయుచుండును, వీనికి-అధిదేవత చంద్రుఁడు, ఇది ఆకాశవాయువులతో సమ్మిళితమైన అంతరింద్రియముగాని- ఆత్మయని చెప్పకూడదు.

౨. బుద్ధిముఖస్థానమందుండి మనస్సుచేయునట్టి సంకల్ప వికల్పములను నిశ్చయించును. వీనికి-అధిదేవత బ్రహ్మ. ఇది=ఆకాశము అగ్నియొక్క- సమ్మిళితమైనది గనుక ఇదియును-అంతరింద్రియముగాని ఆత్మయనిచెప్పగూడదు.

3. చిత్తము నాభిస్థానమందుండి-మనస్సుచేయునట్టి కార్యములను చింతించుచుండును. వీనికి-అధిదేవత విష్ణువు. ఆకాశము ఉదకముతో గూడుటవల్ల సంభవించిన అంతరింద్రియమే గాని - ఆత్మయని చెప్పకూడదు.

౪. అహంకారము హృదయస్థాన మందుండి, అభిమాన పడుచుండును, వీనికి - అధిదేవత రుద్రుఁడు, ఇది-ఆకాశము పృథ్వితో కూడుటవల్ల జనితమైన అంతరింద్రియమేగాని ఆత్మయనిచెప్ప

కూడదు. స్థూలదేహమునీవుకాదు. సూక్ష్మదేహము నీవుకాదు కారణ దేహమున్ను నీవుకాదు. ఈమూడు శరీరముల కున్ను విలక్షణమైన ఆత్మయే-నీవు. జాగ్రతవస్థనీవుకాదు. స్వప్నావస్థ నీవుకాదు. సుషుప్త్యవస్థయున్ను నీవుకాదు. ఈ మూడు-అవస్థలకు సాక్షిగాను తెలివిగానుయుండే జ్ఞానస్వరూపమే - నీవు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయకోశములు నీవుకాదు. ఈపంచకోశములకు విలక్షణము గాను తెలివిగానుయుండే సచ్చిదానంద స్వరూపమే నీవు.

శ్రోత్రం, త్వక్కు-, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు--పాణి-పాదము-గుహ్యము-పాయువులనెడు,ఇంద్రియములున్ను. పృథ్వి, జలము-అగ్ని, వాయువు, ఆకాశములున్ను. శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములున్ను, మనో బుద్ధిచిత్త-అహంకారములున్ను - నీవుకాదే. ఈయిరువదినాల్గు తత్వములున్ను నీవుకాదు. ఇరువదిఅయిదవవాడైన జ్ఞాతవేనీవు. నీవే-పరమాత్మవు. అట్టిపర తత్వమైన యాత్ముడవే-నీవు. ప్రాణాపాన వ్యానోదాన సమాన ములున్ను నీవుకావు. వీటివ్యాపారములున్ను నీకులేవు. వచన, దాన, గమన, విసర్జన. ఆనందములున్ను నీవుకావు. త్వక్చర్మ మాంసరుధిర మజ్జాస్థిమేధ్యములున్ను సత్వరజస్తమోగుణము లున్ను నీవుకాదు. వీనికన్నిటికిని విలక్షణముగాను పరిపూర్ణము గాను తెలివిగానుయుండే - ఆత్మస్వరూపమే నీవు.

ఈనామరూపాత్మికమైన విశ్వము, బ్రహ్మమునకంటె వ్యతిరిక్త మయినది కాదు.

ఎటువలెనంటే - మృత్తువినాగా ఘటమెట్లులేదో, బంగారము వినహా-మకరకుండలములెట్లులేవో, తంతులువినహా-పటములెట్లులేవో, ఇనుమువినాగా-ఖడ్గమెట్లులేదో, అటువలెనే- బ్రహ్మ

ముడివాగా - ప్రత్యగాత్మ లేదు. ఆ బ్రహ్మస్వరూపమే నీవు. నీవే బ్రహ్మస్వరూపము.

ప్రశ్న. ఇందుకు యేమయినా ప్రమాణమున్నదా,

ఉత్త. ఋగ్యజుస్సామాధర్వణ వేదములు నాలుగున్ను, ఉపరి నాలుగు మహావాక్యములున్ను, స్పష్టముగా బోధింపుచున్నవి. ఎట్లనిన, ప్రజ్ఞానంబ్రహ్మ-అనే ఋగ్వేదమహావాక్యం, ప్ర అనే - ప్రకృతి, అనగా-మాయ, మాయ అనగా అహంకారము అనే తెలివికి కనుపించే - ప్రపంచము సత్యమనితోచుటయు, జ్ఞానమనగా-అంతర్బాహ్యములను వాజ్మనసాగోచరమైనదిన్ని, యదృశ్యం తన్నశ్యం యత్కృతం తదనిత్యం. అని ప్రమాణమున్నదిగనుక, ఈ కనుపించే వాక్కున చెప్పబడే-సర్వమున్ను అనాత్మ యని యును, అజ్ఞాన మనియును విడిచిపెట్టి, ఒక్క గురువాక్యము నందే - ఏకచిత్తముగా నిలిచినదే - జ్ఞాన మనియును ఆత్మ-అనియును ఆత్మానాత్మలరెంటిని తెలుసుకొనినతానే బ్రహ్మమ నిప్రమాణమున్నదిగనుక, సమస్తజగత్తుబ్రహ్మమని భావముచే సినదే-గురుదీక్ష.

"అహంబ్రహ్మాస్మి" అనే యజుర్వేదమహావాక్యము. అకార ఉ కారమకారములనే మూడు వర్ణములు కూడినదే ప్రణవమని యును, శబ్దదృష్టి సంకల్పములను సద్గురుడు చెప్పిన స్థాన మందు ఐక్యముచేయుటే యోగమనియును, అకారమైన అర్థమాతృక, ఆధార చక్రమందుపుట్టి పరా-పశ్యన్తిమధ్యమ, వైఖరీచతుర్విధ శబ్దములను దాటి అహం, అని సుషుమ్నను యెక్కి, తనస్థానమందు ఐక్యంఅవును గనుక, అహంబ్రహ్మాస్మి యనుట. అహంఅనగా-నేననే మాట. నేననగా-పరబ్రహ్మ స్వ రూపమనియున్ను ఇదే ఈశ్వరుడనియును, విశ్వముఉత్పాదించి నందున ఈశ్వరనామ మాయెనియును, మంగళ ప్రదమైన తెలివి

నిచ్చుటచేత శివుడనియును ఆతెలివి-నేత్రమధ్యమందు నున్నదనియును ॥ స్మృతి ॥ "విశ్వంచ ద్యురు తంతస్మి న్తత్సర్వం ప్రతిష్ఠితం" అని ప్రమాణమున్నది గనుక, తన నేత్రములయందు కనుపించే సర్వచరాచర ప్రపంచము, ఈశ్వరుడని గురువు చెప్పిన, అద్వితీయ్యాదికను భావించినదే - యజుర్వేదార్థము. ఈ అర్థమభ్యాసమైతే - తానే బ్రహ్మమని - అహం బ్రహ్మాస్మి యని పలుకుట.

"తత్వమసి - అనే సామవేదమహావాక్యము తత్వమసి ఇత్యభేద వాచకం - యేజప న్తి తేశివసాయుజ్య ము క్తిః । భాజాభవ న్తి" అని ప్రమాణము - గురువుయందు క్రియాద్వైతం, ప్రపంచమందు ద్రవ్యాద్వైతం, ఆత్మయందు భావాద్వైతం గలిగినదే - అభేదవాచకము. ఇదే యెల్లప్పుడున్ను ధ్యానకలిగి యుండవలయును. తత్-అనగా-నిరాకార స్వరూపము. త్వం అనగా-హంసస్వరూపము, అసిఅనగా-నిరాకారమందు తిరుగ కలియడము. ఈ ప్రకారముగానమ స్తజగత్తు ఐక్యమవుతున్నట్టు తెలిసి, భ్రమనువిడుచుటే జీవేశ్వరులకు ఐక్యానుసంధానము జీవుడనగా- ప్రపంచము సత్యమనే భ్రమ. ఈశ్వరుడనగా ఈసర్వప్రపంచము అనాత్మయని ఏకత్వసిద్ధి గలిగినదే ఈశ్వరత్వము కాబట్టి, సర్వప్రపంచమున్ను నిరాకార మేనన్న జ్ఞానం కలిగితే - అభేద జ్ఞానమనియును భేదమే అజ్ఞాన మనియును సమస్త శాస్త్రములయందునుజెప్పబడ్డది. కాబట్టిజీవేశ్వరులకు ఐక్యమయ్యే పరిణమించును. అయమాత్మ బ్రహ్మఅనే అధర్వణ వేదవాక్యము, అయంఅనే శబ్దమునకు ఒకపింతమందే తాత్పర్యము గనుక, అండపిండ బ్రహ్మాండములకు భేదములేక, అభేదనిష్కర్షగా, యీవాక్యము పలుకును. అండమనగా- గ్రుడ్డు. పిండమనగా - సమస్త దేహములయందు కారణమైన హంస

స్వరూపము - బ్రహ్మాండమనగా - పదునాలుగు భువనములు తనకుక్షియందు యిముడ్చుకొని తానువిలక్షణామై సర్వసాక్షి యై యున్న పరమాత్మ, వీటికి ఏకత్వసిద్ధి - ఏలాగనిన, బ్రహ్మాండమువలన - పిండాండము, పిండాండమువలన- అండాండము. అండాండమువలన బ్రహ్మాండము - బ్రహ్మాండమువలన అనంత కోటి బ్రహ్మాండములు అనంతకోటి బ్రహ్మాండమువలన-అండాండము. అండాండమువలన - సమస్తజగదుద్భవము, సమస్తజగత్తు - అండములోను, అండము -పిండములోను, పిండము, బ్రహ్మాండములోను, అయిక్యమగుచున్నది. ఈ నాలుగు మహా వాక్యముల అర్థానుభవముకలిగినవారే జీవన్ముక్తులు, ఇందుకు సంశయము లేదు.

ఇది శ్రీమద్వేదాంతసారుండును, స్వయంప్రకాశ పరిపూర్ణుండును, నిరాలంబుండును, అశరీరుండును ప్రకృతి ద్వయదోషరహితుండును, సద్గురు స్వామియగు, పులహరి-ఫీరుదాసుగారికటాక్షంబున, తిరుచునాపల్లి రంగస్వామిచే-ఆంధ్రంబునవచన కావ్యముగారచియింపఁబడి, అచలగురుండగు, పోకల-శేషాచలాహ్వయునిచే పరిష్కరింపం బడిన, ముక్తిప్రదా యినియను గురు శిష్య సంవాద రూపకంబగుభక్తి, యోగ, జ్ఞాన, మార్గములు సమాప్తము.

---

# అచలప్రకరణము



ప్రశ్న. శరీరములు మూడని సెలవిచ్చితిరి, ఈమూడేనా-ఇంకా యేమైనాయున్నవా?

ఉత్త. తానని చెప్పిన నాలవ శరీరమే-మహాకారణమనియును, హిరణ్యగర్భుఁడనియును, ఎఱుకనియును జెప్పంబడును. ఈయెఱుక చేతనే-అచలబ్రహ్మమును సేవించవలయును.

ప్రశ్న. స్వామీ! దయతో-అచలపరిపూర్ణము యెటువంటిదో - ఆనతియ్యవలెను?

ఉత్త. బిడ్డా! శ్రద్ధాసక్తుఁడవై వినుము. అఖండమై-అప్రమేయమై-ఆదిమధ్యాంతరహితమై, తమమును, తేజమునుగాక, మహావ్యాపకమై-స్థిమితమై-అనాఖ్యమై - అనభివ్యక్తమై - అవాచ్యమై-అచింత్యమై-నిర్వికల్పమై- నిష్ప్రపంచమై - ఆనందాతీతమై-సర్వశబ్దశూన్యమై - సనాతనమై-అపర్యంతమై- హేతుదృష్టాంతవివర్జితమై-సర్వాధిష్టానమై-ఈశ్వర, అవ్యాకృత, హిరణ్యగర్భ, విరాట్ప్రాజ్ఞ, తైజస, విశ్వరూప, చిత్ప్రతి బింబ, బింబ ప్రతిబింబ, భావకల్పనావిరహితమై-పరిపూర్ణమై, ఎప్పటికినిముప్పులేక, కదలక-మెదలక, చెదరక, బెదరక, తప్పొప్పెఱుగక, ఆది, అంతములులేక, రాకపోకలులేక, వాదభేదము లెరుగక, ఖేదమోదంబులనుబొందక, నామనీమములులేక, నాదబిందులుగాక, వర్ణాశ్రమములులేక, జాతిభేదములులేక, కులగోత్రములులేక, చావుపుట్టుకలులేక, భక్తికర్మలులేక, యోగజ్ఞానములులేక, అండపిండములుగాక, రేపుమాపులు లేక,

చూపురూపులుగాక, చింతవంతలులేక, మాతృ పితృలుగాక, కళత్రమిత్రులులేక, జీవేశ్వరులుగాక, అన్నిఁటిని మిగిలి లావు సన్నములుగాక ప్రసన్నముగాయున్నది. ప్రేమతో పులహరి ఫీరోజీదేశికుఁడు తనశిష్యుఁడగుతిరుచునాపల్లి-రంగస్వామికిచూపించిన యచలమిది. ఇట్టియచలమందు యెఱుక యెన్నఁడును పుట్టనేలేదు. ఇందుకుసమ్మతము ॥ "అంతఃపూర్ణోబహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవాంభసి - అంతఃశూన్యో- బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే ॥ అనిస్మృతులచేతనున్ను ॥ పూర్ణమదః పూర్ణమిదంపూర్ణాత్ పూర్ణముదీరితం । పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥ యతోవాచే నివర్తంతే అప్రాప్యమనసాసహ"॥ అవేద్యమసంగ-మబోధ్య-మబాధ్య-మకర్మ-మప్రమేయ మద్వయ మనిర్మిత్యం పరమాకాశ మచలం సర్వదాభాతిపూర్ణం ॥ "అనన్వమస్థూల మహ్రస్వ మదీర్ఘమజ మవ్యయం। అరూపగుణ వర్ణాఖ్యం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో । నిర్వికారో నిరంజనః । నిరాకారో నిరాధారో నిత్యముక్తోస్తినిర్మలః" ॥ అని యిట్టి స్మృతిశ్రుతులచేత ప్రసిద్ధముగా చెప్పబడుచున్న సర్వపరిపూర్ణమయిన యీనిర్బ్రహ్మమే - అచలబ్రహ్మము - అని సద్గురుని వలన సూచింపఁబడు చున్నది.

ప్రశ్న. స్వామీ! ఎఱుక-అనగా-ఎటువంటిది?

ఉత్త. బిడ్డా! ఎఱుకను వివరింతుము, ఏకాగ్రచిత్తుండవై వినుము. ఎఱుక-అనగా-సత్యజ్ఞానానంద స్వరూపమైనది. ఇదే-స్వయంభువు. ఇదే-సర్వసాక్షి. ఇదే-ఆపోజ్యోతి. సమస్తమయిన వారలున్ను యీజ్యోతి స్వరూపమునే - బ్రహ్మమన్నారు. ఇదే - అక్షర పరబ్రహ్మం. ఇదే-కళాస్వరూపము. ఇదేమూలమాయ. ఇదే-విరాట్టు. ఇదిసగుణ రూపము గనుకనున్ను, రాకపోకలు

కలిగియుండడము చేతనున్ను, ఇదిపరిపూర్ణము కాదు. ఇదేసత్య మైతే, దీనివల్ల - అయ్యేకల్పన యావత్తు సత్యమవును. ఇది - అన్నిటికి మూలమైనప్పటికిన్ని దీనికిమూలము లేదు. కనుక మూలముకాదు. అమూలముకాదు. ఉత్పత్తికాదు. అనుత్పత్తి కాదు. ఆదికాదు. అనాదికాదు, జ్ఞానము కాదు. అజ్ఞానము కాదు. రూపముకాదు. అరూపముకాదు. అన్నిటికిమూలం అదే గాని దానికిమూలం యెక్కడను లేదు. కనుక మూలముకాదు. ఉన్నట్టుతోచు చున్నదిగనుక, అమూలముకాదు. పుట్టినట్టు కానరానిది గనుకనున్ను, సర్వాభావము గనుకనున్ను, ఉత్పత్తికాదు. ఉన్నట్టుతోచుచున్నది గనుక, అనూత్పత్తికాదు. జ్ఞానాన్నికూడా యెఱుగుచున్నది గనుక జ్ఞానముకాదు. అంతట విచారిస్తేలేదు. గనుక వ్యాపకము కాదు, సమస్తమందు లేకున్నాఫున్నట్టు తోచుచున్నది గనుక, అవ్యాపకముకాదు. అభావముకాదు. ఇదేపులహరి ఫీరోజి దేశమందు తిగుచునాపల్లి రంగస్వామికి చూపించి విడిపింపఁజేసిన యెఱుకయిది. వేపకాయకుతీపు లేనట్టు పరిపూర్ణమందు యెఱుక లేదు. మాయ యెఱుక యేకాలమందు పుట్టనూలేదు, పుట్టింపఁబడనూ లేదు. యామా - సా - మాయా - అని యుండగామాయకునిగ్రహ మెక్కడిది. మాయదబ్బరగదా, మాయ - అనగాలేనిదిగదా, మాయ లేకుండీనమాయాకార్యములు నిజమా - కాదు, కాబట్టి గొడ్రాలికి - ఏకాలమందును బిడ్డలులేనట్టు లేనియెఱుక - అచలపరిపూర్ణమందు - ఏకాలమందునూ పుట్టనేలేదు. పుట్టినదనుట దబ్బర. సత్యమందు సత్యమే పుట్టవలయును గాని - అసత్యము పుట్టనే పుట్టదు, పుట్టిందని చెప్పట భ్రాంతియే గాని నిజముకాదు, గనుక యిదిగురుకృపచేత తెలుసుకొని దహించడమే పరమముక్తి, ఇదేస్వరూప రహితస్థితి

ప్రశ్న. ఈమ్మెటుక నేది - ఏలాగునవచ్చినది?

ఉత్త. నీటిలో-వడగండ్లు-బుగ్గలు-తమకుతామేవచ్చి, పెరిగి యేలాగు నశించిపోవునో-అలాగుననే చలించకనున్న పరిపూర్ణ మందుండి మెటుక తనకుతానేవచ్చి తనకుతానే పెరిగి తనకుతానేనశించి పోవును. ఎవరిపేరంటమున్ను లేదు అది-ఏలాగంటె, కల్లలో, వచ్చినశరీరమును యెవరురప్పించిరి, తిరిగియెవరు కొనిపోయిరి. గనుక కర్తలేదని తెలిసికొనుడు.

ప్రశ్న. పరిపూర్ణము ఉన్నదియున్నట్లు వుండగా- నడిమంత్రపుమెటుకకు యిట్టిమిడిచిపాటెందుకు?

ఉత్త. ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడుగన్నట్టున్ను. మధ్యఅయిశ్వర్యమువచ్చిన- మిట్టిపడిన-చందమన్నట్టున్నయున్నది. సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందు చలించక యొక్క-తీరుగాయుండే - బట్టబయలందు మెటుక పుట్టనే లేదు, పుట్టినదనుటదబ్బర. మెటుకవిడిచిన పుణ్య పురుషులకు చెట్టువలె కదలకుండిన బట్ట బయలందు మెటుక పుట్టనేలేదు. దీనికిసమ్మతి. శ్లోకం॥ రజోకోవిష్ణురిత్యాది। బ్రహ్మాస్పష్టేస్తుకారణం సంహారోరుద్రయిత్యుక్తం। సర్వంమిథ్యేతినిశ్చయం॥

ప్రశ్న. అట్లయితే - పదునాలుగు భువనములున్ను, సకల వేదశాస్త్ర పురాణాదులున్ను యెవరు కల్పించిరి?

ఉత్త. ఎటుకతన్ను యెవరు లేదందురో యని తాను సత్యమని నిరూపించుకొనుటకు,సమస్తమయిన వేదశాస్త్ర పురాణేతిహాసములను-కట్టుదిట్టములుగా కల్పించుకొనిన మెటుకకుమూలము లేక, తనకుతానేవచ్చి, మూలములేని పుత్రమిత్రకళత్రాదులతో - ఆనందించి,తనజాలమునకు తానేసంతోషించుచు,ముందరరదానికి ముచ్చటపడుచు, వెనుకటిదానికి వేడుకపడుచు, తనకు తానే మటుమాయముగా బోవును. అట్టి మెటుక-ఉంటే ఉంటుంది,

పోతెపోతుంది. నమ్మకూడదు. లేదనే నమ్మవలెను. లేదంటె - అందరికి నిష్కారము. స్వప్నములోసంభవించిన పుత్రసంపత్తి మేలుకొంటె కానంబడునా - కానంబడదూ. అందుకు దుఃఖ పడితేమాత్రము వచ్చునా - ఆలాగే వేరేతోచే దేహాములకు పోతవ్రా వుంటవోయని విచారిముతో పనియేమి. వంధ్యాపుత్రునినిమిత్తము దుఃఖపడవలెనా - లేనిదేహాములకు దుఃఖపడడము. ఆలాగే తానులేదుగనుక, తానుచేసిన కృత్యములున్ను లేవని తెలుసుకొనేది. ఇది ముమ్మాటికినిశ్చయం॥ శ్లో॥ "అశరీరం సర్వదాస్తి । శరీరం రహితంసదా । ఇదమేవ సద్యోముక్తిః । అన్యథాభ్రమకారణం" ॥

ప్రశ్న. నామరూపాత్మకమైన విశ్వము, ఇట్లుకనుపడు చుండగా- అబద్ధమనియేలాగున భావింపవచ్చును?

ఉత్త "బ్రహ్మసత్యంజగన్మిథ్యా" యనువేద ప్రమాణము వలన ప్రపంచము సత్యముకాదు.

ప్రశ్న. జగత్తుమిధ్య యన్నప్పుడు, జగత్తు సత్యమై తేనేతప్ప మిథ్య యను ప్రతీతికలుగదు. మిథ్యాశబ్దమునకు-లేదు అనే-అర్థము. లోకములో సత్యమను వస్తువునకు లేదు అనే ప్రతీతియున్నది గాని-అసత్యమునకు అట్టిప్రతీతిలేదు?

ఉత్త జగన్మిథ్యాయను దానికి జగత్తునందు పారమార్థిక సత్యత్వము లేదని-అర్థముకాని, అత్యంతాభావమని - అర్థముకాదు. వ్యావహారిక సత్యత్వము వున్నది కాబట్టి జగన్మిథ్యాయనుటకు బాధకములేదు. ఈప్రపంచము ఇంద్రజాలము వంటిది. ఎట్లనగా-ఇంద్రజాలకుడు తనజాలము గావించినప్పుడు, తనవద్దలేని వస్తువులను సంకల్పమాత్రమున రప్పించి, ఇతరులకు కనుపరచినప్పుడు, ఆవస్తువులన్నియు సత్యముగానే కనుపడి, తర్వాత యెటువలె గనుపించవో-అటువలెనే - ఈప్రపంచమున్ను అప్ర

మాణము అయుక్తము. అనిశ్చితము. అసత్యమైనది గనుక, ప్రపంచరూపవస్తువుగా కనుపడుచున్న దేగాని సత్యముగా కనుపించడముకాదు. ఇంకాయెట్టిదంటే - స్వప్నమువంటిది. ఏలాగంటే-స్వప్నావస్థయందు ప్రత్యక్షముగా కనుపడిన సమస్తశరీరములున్ను, ప్రపంచమున్ను, జాగ్రతకలిగిన పిమ్మట యెట్లువలె గనుపించవో - అటువలెనే పామరులైన జనులు భ్రాంతిచే ప్రపంచమనే కలగంటూ నున్నారు. సత్పురుషులయినవారు సద్గురూపదేశమనే జాగ్రతగలవారై భ్రాంతివల్లనైన యీ ప్రపంచము సత్యముకాదని నమ్ముచున్నారు. ఎటువలెనంటే - ఎండమావులయందు జలమున్ను, శుక్తియందు రజతమున్ను, రజ్జువునందు సర్పమున్ను, దాదువునందు పురుషుడున్ను, ఆకాశమందు నీలపీతాదులున్ను, లేకపోయినను, ఉన్నవనే భ్రాంతియేలాగు-దోచుచున్నదో ఆలాగునసే-లేని ప్రపంచమున్ను భ్రాంతిచే నున్నట్టుతోచడమే కాని-నిజముగ్గాదు. ఇట్టి అసత్యమైన ప్రపంచము సత్యమని చెప్పుట యెటులనున్నదంటే-వన్ధ్యాసూనుని చేత నొకమనిషిచంపబడినా డన్నట్టున్ను, కుందేటి కొమ్ములవలన సింహము చంపబడిన దన్నట్టున్ను, ఒక మానవుడు యెండమావులలో నీళ్లుత్రాగి దాహము తీర్చుకొన్నాడని చెప్పినట్టున్ను, ఒకమనిషి మేక మెడయందుండిన చండ్లలోపాలు త్రాగి-తన-ఆకలితీర్చుకున్నాడని చెప్పినట్టున్ను, కాకిచిలుకవలె పలికిన దన్నట్టున్ను, సూర్యుడు చంద్రునివలె యున్నాడన్నట్టున్ను, ఏనుగయున్ను గుజ్జిమున్ను యొక్క తీరుగానే యున్నవన్నట్టున్ను, సూచింపబడుచున్నవి-గనుక, యీపైనచెప్ప బడినవన్నియు నెంతనిజమో - ప్రపంచము సత్యమని చెప్పుట అంతనిజము. అదియునుంగాక, పరబ్రహ్మము తేజోమయమనియు, మాయతమోమయమనియు, వేదములయందు చెప్పబడి యున్నది.

అయితే యీరెండును-ఏకకాలముందున్న వనిచెప్పుట-అసం భవము. అదియెటువలె నంటే-సూర్యునియందు చేటయంత చీకటియున్నదని చెప్పినట్టుగానున్నది. ఇట్టి-అసంభవము యె చ్చోటనుగానము, కాబట్టి, మాయ నిజము కానిది, ఉనికిపట్టు లేనిది. ఇట్టిలేనిమాయవలన జగములు యెట్లులపుట్టెను గనుక- సత్యమందు సత్యమే పుట్టవలయును గాని-అసత్యము పుట్టదు. కాబట్టిసత్యమైనబ్రహ్మయందు అసత్యమైన ప్రపంచము పుట్టనే లేదు. పుట్టించబడను లేదు. మనుష్యులకు - మనుష్యులున్ను, సింహములకు, సింహములున్ను, ఏనుగులకు-ఏనుగులున్ను,దో మ్మలకు-దోమలున్ను కుక్కలకు-కుక్కలున్ను పుట్టునేగాని, ఒ కజాతియందు మరియొకజాతిపుట్టదు. గనుకసత్యమైన బ్రహ్మ మందు - అసత్యమైన ప్రపంచము పుట్టినదనుట మిథ్యావాద ము. గొడ్రాలికి - ఏకాలమందును బిడ్డలుపుట్టనేలేదు. నామ రూపాత్మికమై- గుణసహితమైన - ఈ ప్రపంచము, నామరూ పరహితమైన నిర్గుణబ్రహ్మ మందుయెట్లు పుట్టునుగనుక, పుట్ట నేలేదు.అజ్ఞానులకుపుట్టినట్లుతోచును.జ్ఞానులకు-అట్లు తోచదు.

ప్రశ్న. అయ్యా లేని ప్రపంచము. అజ్ఞానులకు మాత్రము యెందుకు తోచవలెను?

ఉత్త. అజ్ఞానులు ప్రపంచమును సత్యముగా తలచడము తప్పు కాదు. అందువలన సత్యమనుటకున్ను వీలులేదు. అజ్ఞానము - ఎంతప ర్యంతముండునో - అంతవరకు - ప్రపంచము సత్యముగానే తోచినను, అజ్ఞాననివృత్తులగు పెద్దలకుసత్యమనితోచదు. స్వ ప్నముయెంతవరకు జరుగుతూ వుండునో - అంతవరకు దానికి స్వకాలము, అజ్ఞానము యెంతవరకుండునో- అంతవరకు దీనికి స్వకాలముకాబట్టి, స్వప్నముయొక్క స్వకాలమందు-స్వప్నము సత్యముగానే తోచినట్లు - దీనిస్వకాలమైన అజ్ఞానము వున్న

వరకు యిదిసత్యముగానే తోచడము - ఆశ్చర్యముకాదు. ప్రబోధకలుగుటచేత - స్వప్నకాలముపోగా, స్వప్నము. అబద్ధముమైనట్లు, ఆత్మప్రబోధము కలుగుటచేత. అజ్ఞానముపోగా, ఆ ప్రపంచము - అబద్ధమవుచుగాని, అజ్ఞానులకు ప్రపంచము - అబద్ధముగా తోచలేదుగనుక, ఈహేతువు చేతనే-ప్రపంచము సత్యమనుటకు వీలులేదు. జ్ఞానులయొక్క- అనుభవమేసత్యము.

ప్రశ్న. అజ్ఞానులకు ప్రపంచముండుటయును జ్ఞానులకులేకుండుటయును, యెట్లు, లోకములోనొకవస్తువు యిద్దరికియొక్క రీతిగానేకనుపడునుగాని, ఒకనికియొకవిధముగాను, రెండవవానికి మరియొకవిధముగాను, కనుపడునాయని సందేహము కలుగుచున్నది గాన, ఈసంశయచ్ఛేదమును జేయుగోరెదనూ?

ఉత్త. బిడ్డా! ఇద్దరుబాలకులు-ఆటలాడుకొనుచుండగా, వారిలోనొకడాత్మప్రదక్షిణము చేసుకొనుమాదిర- వేగముగా గిరగిరతిరుగసాగెను, ఈయాటకు-అల్లిబిల్లియని తిరుగుటపేరు. ఇట్లుతిరుగుబాలునకు. వృక్షస్తంభ గృహాదులు తిరుగుచున్నట్లు కనుపడి రెండవబాలకునితో సమస్తపదార్థములు తిరుగుచుండుటనుజూడుమని చెప్పగా, లేదు-ఎచ్చటివి - అచ్చటనేయున్నవని రెండవవాడుచెప్పెను, ఇట్టివి లోకమందుకనియున్నారము. అల్లిబిల్లి తిరుగుటచేత దృష్టిచలించియున్న బాలునకుసమస్తవస్తుజాలము చెలించుచున్నట్లు కనుపడుటసత్యమే, నిల్చియున్న బాలకునకు, అవి-అన్నియునిలిచియున్నట్లు కనుపడుటయు సత్యమేకావున, అజ్ఞానికి ప్రపంచముండుటయు, జ్ఞానికిలేకుండుటయుకలుగవచ్చును. అజ్ఞాని చెంచలమైన మనోవ్యాపారము గలవాడుగాన, అతనికి ప్రపంచమున్నదని తోచవచ్చును. చెంచలము లేనివాడుగనుక జ్ఞానికి లేకపోవచ్చును.

ప్రశ్న. స్వామీ! తమరు - ఆనతిచ్చిన రీతినిచూడగా, ప్రపంచము

మానసికమని తోచుచున్నది. అందుకేమయినా దృష్టాంతమును సెలవివ్వగోరెదను?

ఉ_త్త. ప్రపంచము మానసికమే కావున - అనుమానమక్కరలేదు. దృష్టాంతమును జెప్పెద. శ్రద్ధతో వినుము. మనస్సును సుషుప్తి మ్రింగినప్పుడు యేమియుకనుబడక, తిరిగి మనస్సు-ఇంచుకతోచేవరకు, మనము, ఇతడు, అతడు, అని సమస్తము తోచుచున్నది. సూర్యుడుండు వరకును సూర్యకిరణములు తోచి సూర్యుడస్తగతుండైనచో-సూర్య కిరణములు తోచక పోవుటనుబట్టి, అవి సూర్యుని తాలూకేనని యూహించినట్టు, మనస్సుండగా - తోచే జాగ్రత్స్వప్న ప్రపంచములు, మనస్సులేనప్పుడు లేవుగాన, అవిమానసికములని చెప్పుటకు సందియములేదు,

ప్రశ్న. అట్లయినచో - మనస్సు యొక్క నిజస్థితిని సిద్ధాంతము సేయ గోరెదను.

ఉ_త్త. మనస్సే-మాయగనుక, మాయను నీవుయిట్టిదని సిద్ధాంతమును జేసితివా, మనస్సును నేను సిద్ధాంతముచేసెదను.

శిష్యుడు=మాయ లేనేలేదు.

గురువు=మనస్సున్ను అదేప్రకారము లేదు.

ప్రశ్న. ప్రపంచము సత్యమని చెప్పినందువలన బాధయేమి?

ఉ_త్త. అట్లా చెప్పినందు వలన - అధో గతి పొలగుదురు, నశింతురు. ఏలాగంటే. ఎండమావులనుజూచి నీళ్లనే భ్రాంతిచేత మిక్కిలి డప్పిగొని పరుగుబారినశించిన లేడివలెనే - నశింతురు.

ప్రశ్న. ప్రపంచము - అసత్యమైనట్టులయితే - అనుభవమెట్లుకలుగును. ఇది చిత్రముకాదా?

ఉ_త్త. సరే, స్వప్నమందొక యవ్వనస్త్రీ వచ్చినట్టున్ను, దానితో సరసములాడి సల్లాపములు చేసినట్టున్ను, దానితో సంభోగించినట్లున్ను, స్వప్నమాయెనుగదా! మెళకువ గలిగిన తర్వాతచూ

డగా - ప్రత్యక్షముగాస్థూలమైనదేగాని - అస్త్రికనుపించలేము, గనుక యీప్రపంచముయొక్క -అనుభవమున్ను - అటువంటిదే వని తెలుసుకోవలయును కాబట్టి, లేని ప్రపంచము భ్రాంతిచే దృఢముగానున్నట్టు కనుపడుటవల్లనే- ఇన్నివిధములుగా చెప్ప వలసివచ్చినది. లేనిదియున్నట్టుగాతోచకపోతే-బోధతోపనిలేక నేయుండును. పొరపాటులేకపోతే-సవరణతోపనిలేదు. ఇంకొ కదృష్టాంతమునుగలదు. ప్రపంచముసత్యమైతే-గాఢసుషుప్తిలో కూడా కనుపించవలెనుగదా అట్టిసమయములో యెంతమాత్ర మున్ను కనుపించలేదుగనుక, ఇదియే - అనుభవముగా - ఎంచ వలశినది.

ప్రశ్న. అన్ని అవస్థలలో కనుపడునదియే - సత్యమన్నయెడల, జాగ్ర త్స్వప్న సుషుప్త్యవస్థలయందు కానరాని, యీబ్రహ్మముమా త్రము సత్యంబెట్లగును?

ఉత్త. అట్లుకాదు, బ్రహ్మముసర్వకాల సర్వావస్థల యందుండునదియై సత్యంబైనను, మనకుగల - అవిద్యాసంపర్కమను నుపాధిచే- గానరాకున్నదిగాని, స్వతసిద్ధముగా లేకపోలేదు. పుట్టిందిభ్రాం తియేగాని జగముకాదు. ఇది కోటిపర్యాయములకు నిజము.

ప్రశ్న. పదునాలుగు భువనములున్ను, సకలవేదశాస్త్ర పురాణేతిహాస ములున్ను, మాయకల్పించినదని చెప్పిరిగదా, మాయయొక్క జడముగనుక, దానికి సృష్టిశక్తి యేలాగునకలిగినది ?

ఉత్త. పరిపూర్ణసాన్నిధ్యమువల్ల మాయయొక్కకు సృష్టిశక్తికలిగినది యేలాగంటే- సూర్యోదయభాతిసహాయమువల్ల సమస్తజీవరా సులకుచలించుటకుయేలాగుశక్తికలదో- అటువలెనున్ను, ఆత్మ సాన్నిధ్యమువల్ల జడముతైన - ఇంద్రియములకు చలించుటకు యేలాగుశక్తికలదో-అటువలెనున్ను, పరిపూర్ణ సాన్నిధ్యము వల్ల మాయ యొక్కకు సృష్టిశక్తి కలిగినదిగాని పరిపూర్ణము

కర్తృత్వభోక్తృత్వాదులులేనిదిగనుకమాయయెఱుకయొక్క-చావుపుట్టుకల నెఱుఁగదు.

ప్రశ్న. అయితే శూన్యమైనయెఱుక పుట్టినదనియును పెరిగినదనియును పోయినదనియును యేల చెప్పవలశివచ్చినది?

ఉత్త. యక్షరాజధానికి రాజుగా నుండెడు స్థాణు పురుషుఁడు వేటకు పోయి, కుందేటికొమ్ముపోటువల్ల మృతిబొందినందున ఆ పట్టణమునకు వేరొక రాజును నేర్పరచతలచి, మానుగజమయిన పట్టపుటేనుఁగను శృంగారించి, ఎండమావులయందుండెడు-ఉదకముతో పూరింపబడ్డ సువర్ణ కలశమున్ను, ఆకాశ పుష్పమాలయున్నుయివ్వగా, ఆ యేనుఁగు ఆపట్టణమునకు రాజుగా నుండతగినవాడనియెంచియీవంధ్యాపుత్రునిశిరస్సుయందు-ఆకలశోదకమునభిషేకించి,ఆకాశపుష్పమాలనుకంఠమునందుధరియించి, అతనినితనమస్తకమునందు కూర్చుండఁబెట్టుకొనితీసుకొనిపోగా, అతనికి చేయబడ్డ పట్టాభిషేక వర్ణనమును కూర్చి కొనియాడునట్లున్నది. అనగా యక్షులకు రాజధానికలదా. స్థాణువు పురుషుఁడుగా నుండునా. కుందేటికికొమ్ములుండునా, మాను గజము పట్టపుటేనుఁగు అవునా, ఎండ మావులయందుదకముండునా ఆకాశమునందు పుష్పములుండునా, వంధ్యాపుత్రుఁడుకలఁడా, ఈయేడున్ను యెటులనసత్యమో. అట్టి-అసత్యవితతినికూర్చికొనియాడిన నెటుల ప్రయోజనములేదో, ఆలాగె -సూదిమొనమోపనందులేక నిండి నిబిడీకృతమైయున్న, అచలమందు లేని యెఱుకయెన్నడూ పుట్టనేలేదు. అట్టియెఱుకపుట్టి పెరిగినశించినదని చెప్పడము-ఏలాగున్నదంటే - వంధ్యాపుత్రుని యొక్క-పట్టాభిషేకమును వర్ణించినటుల యున్నది.

ప్రశ్న. లేనియెఱుక బయలులో పుట్టినటుల యేలాగునవాడుక కల్గినది?

ఉత్త. కలలోప్రపంచమని, యెండమావు లుదకమని, రజ్జువుసర్పమని

గొడ్రాలు బిడ్డయని, ఆకాశపుష్పమని, దారుపురుషుడని, సుప్తి కలువెండియని, స్థాణుపురుషుడని, కుందేటికి కొమ్ములని, మానుగజమని యెట్లు చెప్పచున్నారో - అలాగుననే శూన్యమైన యెఱుక భ్రాంతిచే కలలో ప్రపంచము వలెనున్ను, యెండమావులందుదకము వలెనున్ను, త్రాటియందు సర్పమువలెన్నున్ను, ముత్యపు చిప్పలయందు వెండివలెనున్ను, చీకటిలో మొద్దు పిశాచరూపంగ వలెనున్ను గాన్పించునే గాని, నిజముగాపై చెప్పినవి సత్యములు కాకపోయినను భ్రాంతిచే సత్యముగా నున్నట్టు కనుపించినది గనుక, భ్రాంతినివిడిచి - అశరీరికావలెను. దీనికిసమ్మతి ॥ "భ్రమేణాహం భ్రమత్వంచ । భ్రమేణోపాసకం జనః । భ్రమేణేశ్వరభావత్వం । భ్రమమూల మిదంజగత్" ॥ అని యున్నది.

ప్రశ్న. అశరీరులు - ఏవిధముగా నుందురు. ఎటులగనుపింతురు. అట్టివారలనెటుల చూడవలయును?

ఉత్త. సంకల్పవికల్పములు లేకసర్వసములై, జితేంద్రియులై, అహంకారరహితులై, దూషించినప్పుడు కోపమున్ను-భూషించినప్పుడు సంతోషమున్ను లేనివారలై, తాను-నేను- అనేభావములేనివారలై, ప్రకృతి ద్వయదోషరహితులై, పుట్టుక- చావులేనివారలై, సహజము మానని వారలై, అద్యోదానియందు ఆశ వుంచని వారలై, వెనుకటివాటియందు వేడుకపడని వారలై, అసత్యము పూననివారలై, నిజముమరువనివారలై, పెట్టినది, తిన్నది గురువునకర్పితము సేయువారలై, ఉండెడు వారలు యెవరుగలరో, వారు అశరీరులు. వారుఅటువలెయీపైన చెప్పబడ్డ వృత్తులుగలవారలు యెవరుగలరో వారలకు గనుపింతురే గాని - యితరులకు గనుపించరు. ఇందుకు దృష్టాంతము యెటువలెనంటే, ఒక గ్రామమునకు యితర గ్రామమునుంచి వక శాస్త్ర

జ్ఞుఁడువచ్చిన సంగతి, ఆగ్రామములో నుండే శాస్త్రజ్ఞునకు యె
టుల తెలియునో, అలాగున్ను. మఱియొక గ్రామములోనికి గంజా
యి త్రాగేవాడు వచ్చినసంగతి, ఆ గ్రామములో కాపురమున్న
గంజాయి త్రాగేవానికి యెట్లు తెలియునో-అవిధముగానే, అ
శరీరులైనవారు శరీరాభిమానములేనివారికే కనుపింతురు. గంజా
యి త్రాగేవాడు వచ్చినసంగతి శాస్త్రజ్ఞునకు యెటుల తెలియ
దో, శాస్త్రజ్ఞుఁడు వచ్చినసంగతి గంజాయి త్రాగేవానికి యెట్లా
తెలియదో, అవిధముగానే యితరులైన వారలకు - అశరీరుల
సంగతి తెలియదు. అదియునుంగాక సూర్యుఁడు మలిన రహి
తమైన జలమునందును, నిర్మలమైన - అద్దమునందును యెటు
లకనుపించుచున్నాడో, అటువలెనే - అశరీరులున్ను నిర్మలా
త్ములైన నిస్సంగులకు మాత్రమే కనుపింతురు, సూర్యుఁడు మ
లినరహితమైన బురదయందు యెట్లా కనుపించడో, అవిధము
గానే అశరీరులున్ను-అరిషడ్వర్గములతో గూడుకొనియుండెడి
మలినాత్ములకు కనుపించరుగాన, గురువు శరీరము లేని వాడని
చెప్పఁబడును.

ప్రశ్న. గురువుకు శరీరములేకపోతే యేలాగునబోధిస్తాడు?

ఉత్త. గురువుయొకడు, శిష్యుడుయొకడు, గురువుబోధించి నట్టున్ను
శిష్యుడు విన్నట్టున్ను తోచేభిన్న భావము భ్రమచేతనే కానియ
దార్థముకాదు. అది యెట్లనిన శిష్యునియొక్క- స్వప్నమందు
గురువువచ్చి మాట్లాడిన సమాచారము గురువుకు తెలియద
నుటయెట్లా-ఆశ్చర్యముకాదో, అలాగే గురు శిష్యులకు జరిగె
బోధగురువుయెఱుగడు-అనుటవింతగాదు. ప్రపంచమును, శరీర
మును, స్వప్నమువంటివిగాన, లేదని-గురువుయెంటనే యెఱిగివే
ల్కానియున్నాడు. శిష్యుఁడుయెఱుగడు కాబట్టి, ప్రపంచమును,
శరీరమును సత్యముగానే భావించి కలకంటున్నాడు, గురుశిష్యు

లకు కలిగే సంవాదము శిష్యునికలగాని, గురువునకు కలగాదు. గు
రువు యొకడు తాను యొకడు ఉన్నట్టున్ను, ఆయన చెప్పుచున్న
ట్టున్ను, తాను వినుచున్నట్టున్ను, శిష్యునకు తోచును గాని,
గురువునకు తోచదు. ఏలాగంటే, శిష్యునికలలో తనతో మా
ట్లాడిన పెద్దమనుష్యుడున్ను, ఆప్రసంగమున్ను, ఆమాట్లాడిన
తానును మేలుకొని చూచేవరకు యేలాగబద్ధమో, ఆలాగే
శిష్యునకు పూర్ణబోధ కలిగే వరకు బోధకుడైన గురుడున్ను,
బోధయున్ను, బోధపొందెడు తాను అనే-అభిమాని యున్ను,
లేకపోవును గనుక గురు శిష్యరహితము కావలెను.

ప్రశ్న. గురుశిష్య రహితము - ఏలాగు కావలెను?

ఉత్త. కర్పూరశిఖవలెన్ను, అరణ్యదావాగ్నివలెన్ను, కావలెను. ఏలా
గంటె, శిఖకర్పూరమును దహించి తానెటులలేక పోయినదో,
దావాగ్ని- అరణ్యమును దహించి తానెటులలేక పోయినదో,
అటువలెనే - తాననే కల, గురువాక్యమనే మెళకువచేత లేక
పోయినపిమ్మట, బంధమోక్షములున్ను, ద్వంద్వాద్వంద్వములు
న్ను, గురుశిష్యులున్ను, ఏమి లేవని తెలిసికొనవలయును.

ప్రశ్న. సుషుప్తమయిన వారలకు ముక్తికావలయుననేకదా, తానుంటె
ముక్తియేలాగున కలుగుచున్నది. తాను లేకపోయినట్టులయితే
ముక్తియెవరికి?

ఉత్త. సుషుప్తివచ్చుచున్న సమయమందు జాగ్రతవదలి సుషుప్తిపొం
దకమునుపు సుషుప్తివచ్చుచున్నదని తెలిసి, తర్వాత యేలాగు
తెలియదో, ఆలాగుననే- తాననే యొఱుక లేక పోవుచున్నప్పుడు
యొఱుక లేక పోవడమే ముక్తి॥ దీనికి సమ్మతి॥ శ్లో॥ "ద్వేపదే బంధ
మోక్షాయ। మమేతి నిర్మమేతి చ। మమేతి బధ్యతే జంతు। నిర్మ
మేతి విముచ్యతే॥"

గురువు చెప్పుచున్నాడు. బిడ్డా! నీవడిగిన - అన్ని ప్రశ్నలకు

సదుత్తరములతో గోప్యములుంచక బోధచేసితిని. నేనుచెప్ప బోయేదానిని సావధాన చిత్తుండవై వినుము. ఉన్నదియున్నట్టు, లేనిది లేనట్టు చెప్పఁబడును. లోకులు, ఉన్నది లేనట్టు, లేనిది యున్నట్టు ఉభయసంధి తెలియక యాలోచే-అన్నియును సత్యమని, అహంకారముచేత - అనెదరు. నీవు - అలాగే సత్యమని నమ్మితే భ్రాంతిరహితము కొన్నటికి కానేరదు. ఇలకుమర్యాద చేసేవారు యిలలో వారే. అదియేలాగంటే- ఇలరూపకమైన ఈప్రపంచములో, ప్రపంచమువలెనే లేకవుండే సకలనిర్ణయాలు నిశ్చయమని బద్ధులైన వారునమ్మి యున్నారు. ఇలనమ్మరాదు. ఈలాగునే చెప్పితే యెవరున్ను నమ్మరు. ఇదిగాక యేమార్గము నమ్మినా రాజమార్గమును విడచి, కొండదోవలకు జొచ్చినసంగతి - అవుతుందిగాని, యదార్థముగా జన్మరాహిత్యమైనయుక్తిగలుగదనితోస్తుంది. ఇందుకుభూమండలములో శరీరము లేని గురుసాంప్రదాయము ఉన్నదని యెవరుయెరుగరు. నీవుమిక్కిలి జాగ్రతయును, తీవ్రప్రజ్ఞయును, చిత్తశుద్ధియును, సాధనచతుష్టయసంపత్తియును. మిగుల వైరాగ్యమును గలవాడవై, నన్ను చేరినావు. కాబట్టివాక్యత్రయములను బోధచేయతలచితినిగాన యేకాగ్రచిత్తముతో శ్రద్ధాసక్తుఁడవై వినుము.

ఈఉత్తబట్టబయలు యేమీలేదు. అనిద్వాదశాక్షరీ మంత్రమున్ను మంత్రమూలమంత్రార్థములున్ను బోధించి సాక్ష చేసిసూచించెను. శిష్యుడు ఏకాగ్రబుద్ధి గలవాడు గనుక గ్రహించి మౌనముగానుండెను. బిడ్డా! ఏమిదర్శించితివి, మౌనముతో మాట్లాడకుంటివనిన, సద్గురువర్యా, నాకు ముందు వెనుక యిరుపార్శ్వములనున్ను, నడుమూ, క్రింద, మీద, దశదిక్కులు మిగిలి అంతట నిండియుండే అచలమునుజూచితిని, బిడ్డా! అదియెప్పుడున్నదా, నీవుచూచినప్పుడుమాత్రమే యున్నదా? నాయనా! అచల

ము పుట్టనిది చావనిది తనకు తానే స్వతస్సిద్ధమై ప్రత్యక్షము గానున్నది. లేను ఉన్నదని చెప్పినను ఉన్నది, లేదని చెప్పినను యున్నది. అనేకముంది లేదనినను యున్నది. నేనురాకమునుపు యున్నది. నేనున్నప్పుడునుయున్నది. అదియిక్కడనుయున్నది. సకలదేశముల యందునుయున్నది. సర్వకాలములయందు చలించకయున్నది. సమస్తమైనవస్తువుల యందునుయున్నది. ఇట్లా చెప్పిన శిష్యునిచూచి, ఆనందభరితుండై యిట్లనియె: నాయనా! కొందరు - అచలమునుదర్శించకయే అచలమని చెప్పుదురు. అది-ఎలాగంటే, కనిమొఱిగినవిక్కొన్ని, కానక మొఱిగే వి మరికొన్ని అన్నట్టుయున్నది. అదియేమనిన, రాత్రికాలమందు నొకచోరునిచూచియొకకుక్కమొఱగసాగెను. ఆకుక్కమొఱిగెడు ధ్వనివిని యాగ్రామములోనుండు కుక్కలన్నియును ఆమనిషిని చూడకయే, మొఱగసాగెను. అటువలెనే - అచలమును నిజముగాదర్శించి, అనుభవముగాక, వాచావదికే=అచలులు-అనేకులుగలరు. నీవువారివలెగాక, అనుభవ-అచలుడవైనందుకు నాచిత్తమురంజిల్లెను. ఇదియే, మీతండ్రి ఉపనయనకాలమందు ఉపదేశించిన గాయత్రీమంత్రమిదేయని - ఆ మంత్రమున్ను, ఆమంత్రమూల మంత్రార్థములను - తేటపడునట్లుగా బోధించెను.

బిడ్డా! ఎఱుకమదర్శించుమని చెప్పదొడంగెను, వాక్యార్థపరులు యెఱుకను నిజముగాదర్శించిన వారుగారు, నిజముగాదర్శించిన పుణ్యపురుషులు లోకమున అరుదుగానుందురు.

బిడ్డా! ఎఱుకను దర్శించనేరక నిష్కళంకానినియును, తానేపరబ్రహ్మమనియును, అనేక గ్రంథశోధనలచే వాక్యార్థపరుడు చెప్పుటచేతనే బ్రహ్మసిద్ధికలుగనేరదు. వాక్యార్థపరులు అనేకులుగానుంటున్నారు. ఎఱుకను నిజముగా దర్శించినవారు లోకం

బునసరుకుగానుండురు, నిజముగా దర్శించేవిధము చెప్పెద వినుము. అది యెట్లనిన, కంటిదృష్టివలన నామ రూపాత్మకమైన ప్రపంచము తెలుగబడుచున్నది, దర్పణమువలన తన ముఖమును, నాసిక, నేత్రములును, కారణస్వరూపమును, తెలిసికొనినటుల, నీలతోయదమందునిలచి, అర్యదర్పణముచేత యెఱుకను దర్శించుమని, మూలములేని యీగు ర్తెరిగెశరీరం యేమిలేదు, అనిషోడశాక్షరీ మంత్రమున్ను, మంత్రమూలమంత్రార్థములున్ను బోధించి, అర్యదర్పణముచేత యెఱుకను జూపించెను. శిష్యుడుచూచి నాయనా? ఎఱుకనుదర్శించితిని, ఇతడేసర్వసాక్షియనియును, ఇదేమూలమాయ యనియును, ఇతడే విరాట్టనియును, ఇతడే స్వరాట్టనియును, ఇతడే యింద్రజాలకుండనియును, శరీరము ఆత్మ వేరుకాదనియును, ఈరెండునుయొక్కటే యనియును, నాకు దృఢమాయెను.

బిడ్డా? ఈషోడశాక్షరీ మంత్రార్థమే నీకు నీతల్లి-నీవు పసిబాలుడవుగా నున్నసమయమందు! నీకుబోధించెను. నీకుగల-అజ్ఞానముచేత నీమనస్సునకు పట్టకపోయెను. అయితేస్వామీ? నాజననిబోధించినదెద్దినాకుదయతో నెఱిగింపుడు,బిడ్డా! నీవుఅతిబాలుడవుగానుండియేడ్చుసమయంబున, నీతల్లి నీవీపున హస్తంబుచేర్చి, నిన్ను నిద్రపుచ్చుటకు నుద్దేశించి పాడినజోలపాటకు పల్లవిగా-హుళహుళక్కి హాయి! అనిరాగసరళితో పాడగా నీవు ఆబోధార్థమును, ఎఱుంగకనే-హాయిని చెందినావు. అది యెట్లనిన, నీతనువును జూపించి యిదిహుళహుళక్కి, అనగా లేనిదని నిశ్చయమైతే - నీవుహాయిని పొందుదువని, నీతల్లి బోధించెను అదే-నేను యిప్పుడు నీకు చెప్పితిని.

కలలోదోచిన పదార్థములు, ఏలాగో-అలాగే-అనిపంచదశిమంత్రమున్ను, మంత్రమూల మంత్రార్థములున్ను బోధించెను.

బిడ్డా! కలలోవచ్చిన శరీరములున్ను, రాజులున్ను, భటులున్ను, మేల్కొన్న కొనంబడునా, వారిని యెవరు రక్షించిరి, తిరుగయె వరు కొనిపోయిరి, అటువలెనే యీనామరూపాత్మకమైన విశ్వ ము-కలలోవుండేవారికి తోచునేగాని, గురువాక్యమనే మంత్ర ముచేత మేలుకొన్నవారికి తోచదు, తోచేదేభ్రాంతి.

బిడ్డా! మేముగురువులము, నీవుశిష్యుఁడవు, మాకుగురుదక్షిణసమ ర్పింపుమని యడిగెను. సద్గురువర్యా! నన్నుతప్ప నా వద్దనేమి యున్నది కాబట్టి యేమిదక్షిణ సమర్పింపగలను. మీరే నేనై యున్నాను. పరిపూర్ణముతప్ప మరి యేమియును లేదు. మీరే మిసమర్పింపుమని-ఆనతిచ్చెదరో, అది మీకు సమర్పించెదను. బిడ్డా! పరిపూర్ణమును యెఱిగిన యేయెఱుకగలదో, దాన్ని గురు దక్షిణగా సమర్పింప వలయును., అటుల నీవు సమర్పించిన యెఱుకను తిరిగి పుచ్చుకొనిన యెడల గురు ద్రోహ మవును. కాబట్టి నీవుమరల దానికి యాశపడకుము. శిష్యుఁడు, అత్యంత సంతోషముతో గురువునకు యెఱుకనుసమర్పింపదలచి గురువు కు ప్రదక్షిణముచేసి గురు పాదములను తన నేత్రములయందు కలిగిన- ఆనంద భాష్పములచే కడిగి, హృదయ కమలమందు నిలుపుకొన్న నిశ్చలచిత్తముతో నామహాత్ముని పాదములయందు సుగంధమునుబూసి. వివిధపుష్పములతో, సువర్ణరత్నములతో బూజించి యెఱుకను గురుదక్షిణగా సమర్పించి యేమియును గాక పరిపూర్ణుఁడై యుండెను. అట్టి శిష్యుని సద్గురుఁడు చూచి, తనకు సమర్పించినయెఱుకను తను మనో ధనములను మఱల గ్రహించునో లేదో, పరీక్షింతమనియును, శిష్యునకు దృఢచి త్తమును, సమరసభావమును. అభేదమును, అరిషడ్వర్గములను విడిచియును ఈర్ష్యాసూయతలు లేకను, ఉన్నాడో - లేదోయ ని యోచించి యనేకవిధ పరీక్షలుగావించిరి. అందుకు చలన

రహితుండనై విష, పీయూషములు సమానములుగాను, మేధ్యామేధ్యములు సమానములుగాను, గుణములు భేదించకను, ముఖము వాడకను, సద్గురుని యాజ్ఞకు వెనుకకు తీయకను, ధీరుండనై యుండునట్టి నన్నుం గాంచి సంతోషానందభరితుండై నిజగురుడు పక్కున నవ్వి నన్నుం గౌగిలించుకొని, బిడ్డా! నీయొక్క పరిపూర్ణసిద్ధినిం గనుగొంటినని దీవించెను. ఇదియే పరిపూర్ణసిద్ధి, ఇదియే - అచలపరిపూర్ణభావము, ఇదియే - నిజగురు సాంప్రదాయము.

ఇది శ్రీమద్వేదాంతసార, సచ్చిదానంద రహిత, నాదబిందు కళా
తీతుండును. ప్రకృతిద్వయదోష రహితుండును, నిర్వికార ని
రంజనుండును - అచల పరిపూర్ణుండును, అశరీరుండును
నగు, పులహరి - ఫీరోజీ దేశికస్వాములవారి కటాక్షం
బున తిరుచునాపల్లి, రంగస్వామి శెట్టిచేత-ఆంధ్రం
బున వచనకావ్యంబుగ రచియింపంబడి, అచల
గురుండగు, పోకల-శేషాచలాహ్వయునిచే
దిద్దుబాటు చేయించి ప్రచురింపంబడిన
ముక్తిప్రదాయిని యను గురుశిష్య
సంవాద రూపకమగు - అచల
మార్గము సర్వంబును
సమాప్తము.

# నక్షత్రమాలిక.



మద్గురుండగుపులహరి ఫీరోజీదేశికుఁడు
సిద్ధిపొందిన విషయమై చేసిన నక్షత్ర మాలిక.

శ్రీశేషగురువరు సేవాధురీణుండు పరిపూర్ణభావవిభ్రాజితుండు। ఆదిమధ్యాంతశూన్యాత్ముఁ డఖండచిదానందుఁడ చలసిద్ధాంత వేది। పామరజన మనోబంధ మోచనకారుఁ డకళంక రాజ యోగాన్వితుండు। బ్రహ్మైక్య సంధానపరుఁ డాగమాంత విశేషజ్ఞజనమౌళి శేఖరుఁడు। ప్రేమతోఁ పులహరి ఫీరోజిగురువర్యుఁ డధ్యాత్మయోగీంద్రులభినుతింప। సరవిమీఱ విరోధి సంవత్సరాషాఢ శుక్లయేకాదశిశుభదినమున। హరిహరబ్రహ్మాదులంద శక్యముగాని యలఘుసమాధి నిశ్చలతనొంద। దలఁచి శాస్త్రోక్త విధానంబుగావిమానాధిరూఢుండైన యవసరమునఁ। జెలువొప్పఁగా మేన నలఁదిన గంధంబు పోలుపొంద ధరియించు భూతిగాఁగ। పుణ్యాత్ములర్పించు పుష్పమాలికలెల్ల రమణీయభుజగహారములుగాఁగ। తిలకింపనొసటదిద్దిన చెందిరము చుక్క ఘనమైన వహ్నిలోచనముగాఁగ। మతిమంతులైనట్టి మహనీయ్యజనులెల్ల కీర్తింపపరశివాకృతివహించె। లోచనోత్సవముగాఁ జూచు జనంబుల కత్యంత సంతోష మావహిల్ల। భాసిల్లు పత్తేన పల్లిపట్టణమందు సర్వ జనంబులు సన్నుతింప। చావుపుట్టువులేని తావుదెల్పెడివారలెవరొకో యనికొంద తెన్నుచుండ। మరికొందఱద్వైత మతముపదేశింపఁ గలవారలెవరంచుఁ గాసిఁజెంద। ఇటువంటి గురువర్యు నెటులగాంచెదమంచు పాటిమీఱ గభక్తికోటులెన్న। పరతత్వ మర్మమేర్పడఁ దెల్పు దేశికవరులెవ్వరని ప్రాజ్ఞవర్య

లెన్న । కారణాపేక్షితగలవార లిటువంటి గురువర్యు లెవరంచుగుందు
చుండ । సరసాత్ములగుసాధు జనులిందు రారే యనుచు గొందఱుమ
హాదార్తిఁజెంద । సంతతాత్మా నాత్మసరణి గాంచినభక్తులానందమున
గాని యాడుచుండ । లాలితంబుగ నారికేళ ఫలంబులు ప్రియమొప్ప
గొరిదఅర్పించుచుండ। పుణ్యాంగనాజనంబులు వేడ్క మీరకర్పూరనీరా
జనంబులునొసంగ । మేటిసత్తెనపల్లి పేటలోపల మహాధన్యులెన్నఁగ మ
హోత్సవముతోడఁ । బఱ తెంచితిరుచునాపల్లి రంగస్వామి। ఘనతని
ర్విన్నసమాధినివసించె । కేవలాషాఢ సత్కృష్ణపక్షాష్టమి శనివారమున
శిష్యసమితి జేరి । గురువరారాధనపరగంగఁజేసిరి గుణవంతులగు బుధ
కోటులెన్న । సచ్చిదానందగురుమూర్తిసచ్చరిత్ర । మవని నాచంద్ర
తారకంబగుచు వెలయుఁ ।. బరఁగ వినరయ్యజనులార భవ్యమతిని।
సందియములేదు మీకునా నందమొదవు ॥



శ్రీరామచంద్ర సద్గురు పరబ్రహ్మణేనమః.

శ్రీ శ్రేసికేంద్ర కృతపరమానంద సుధాలహరియందలి.

# భక్తిమార్గకీర్తనలు.



రాగము, శంకరాభరణము - చాపుతాళము.

రామభజన సేయరాదటె । జీమనసపరం । ధాముని సేవింపరాదటె । ఆముకొన్న ఘోరకిల్బి షౌఘములను పరిహరించి । ప్రేమ మీరబ్రోచు తారక నామమలరు సీతామనోభి ॥ రామభజ ॥ ౧ ॥ సంకటములు దీరిపోవును । సదాసుధీవ । శంకరత్వమనువు విస్తారును । పొంకముగను దివ్యమంగళాంక విభవ మమరనిరా । తంకచిదానంద సౌఖ్యదాయక మనియెంచిసీతా ॥ రామభ ॥ ౨ ॥ నీల నీరదాభ గాత్రుఁడు । కస్తూరితిలక । ఫాలసరోజాతనేత్రుఁడు । మేలిమీబసిండివలువ వ్రేల సత్కిరీటరుచిర । జాలమావరింప సద్దయాల వాలుడై వెలుంగు ॥ రామ ॥ 3 ॥ నిరతభక్త పారిజాతము । పావనమునిరం । తరముతై త్రిలోక్య పూతము । సరసిజగర్భా మరేంద్ర సకలనిర్జరాఘవినుత । కరపరాత్పర స్వరూపపరవిలోక రూపమొసగు ॥ రామ ॥ ౪ ॥ పంచ పంచహృషీకంబుల । నిరసించివియ । త్ప్రంచకాంచ దైకసూజ్వల । పంచశక్తి పంచముక్తి । పంచకర్తాతీత - మైవిక । సించినిర్వికార నిర్మలాంచితమై వెలయునాత్మ ॥ రామభజన ॥ ౫ ॥ వాసనత్రయంబడంగును । సంపూర్ణచిద్వి । లాసమోద మంధగల్గును । భాసమాన భద్రశైల వాసరామ చంద్రశ్రీని । వాసమహాద్భక్త హృద్వికాస నిరామయసదాత్మ ॥ రామభజన సేయురాదటె ॥ ౬ ॥

౨. కీర్తన - రాగముపూరికల్యాణి - తాళము రూపకము.

రామరామరామ రామరామ కృష్ణతారకం । రామరామసర్వదోషదుర్వి పన్నివారకం ॥ రామ ॥ ౧ ॥ సంతతంబు భక్తిమీరసా

మి నిన్నుగొల్వగా । చింతలన్నిదీర మిగులసేవయొసగు చెల్వగా ॥ రామ ॥ ౨ ॥ కామమోహ ములనుగెంటి నీమహాత్వమెన్నగా । నా ముకొన్న పుట్టుగిట్టుబాములన్ని సున్నగా ॥ రామ ॥ ౩ ॥ తామసుల ము దుష్టమతులమే మెఱుంగజాలము । నీమవర్జితులము శుద్ధపామరు లము యేలుము ॥ రామరామ ॥ ౪ ॥ ఎన్నియెన్ని జన్మములను రా త్రియుడుము పాట్లుల । ష్నన్నుగాఘటింప వలయుచున్న వెన్నికోటులు ॥ రామ ॥ ౫ ॥ అన్నిటికిని నీపదాంబు జాశ్రయంబే పారము । నిన్ను సన్నుతింప గలిగె నితరమేమిగోరము ॥ రామ ॥ ౬ ॥ ఇలనుమున్ను పుట్టియను భవించినదియె చాలుగా । దిటముగునీ నామభజన కుటిల ములను ద్రోలుగా ॥ రామ ॥ ౭ ॥ ద్రోహశీల చిత్తులనుచు ద్రోహ మెన్నబోకురా । మోహజలధి నావయైన శ్రీహరేపరాకురా ॥ రామ ॥ ౮ ॥ బాములనే యటవికి నీనామమెకార్చిచ్చురా । రామనామమా శ్రితులకు కామితార్థమిచ్చురా ॥ రామ ॥ ౯ ॥ గండదోషములను బాపినిండు దయనుబ్రోవరా । యండదండమాకు నీవై యుండు జానకీ శ్వరా ॥ రామ ॥ ౧౦ ॥ ఎల్లలోకములను మిగిలి కొల్లలయ్యె నీదయ । చల్లనైన చూపులెసగ జల్లుకల్లగాదయ ॥ రామ ॥ ౧౧ ॥ ప్రాపునీవె గాక పరగనెవ్వరున్న వారు । నాపుకాపునీవె తప్పనన్య లెవ్వరు లేరు ॥ రామ ॥ ౧౨ ॥ సతముగాదు యిహసుఖంబు బ్రతుకు లతుకు లాయరా । గతమనాగతము శాశ్వతము కరుణసేయరా ॥ ౧౩ ॥ పోయె కాలము వృథామాయ ననుసరించి యున్నదాయు నిన్నుగొలిచిన స్వ శ్రేయసంబు మించియుండె ॥ రామ ॥ ౧౪ ॥ మాటిగోసి మాటిరో సిమాటిమాటి దాటగా । మాటినడుమ బాటసూటి నాటిచూడనే టుగా ॥ రామ ॥ ౧౫ ॥ నిండుపున్నమ చందురుని పండువెన్నలందున । దండివియన్మండలమైయుండి యటవెందున ॥ రామ ॥ ౧౬ ॥ భా సురముగ భద్రశైల వాసుడైనవాడవు । వాసుదేవగురో శీనుదాసు సేలినాడవు ॥ రామరామరామ రామరామ కృష్ణతారకం.

...తోడి - రూపకతాళము.

౩. ... - మహుబ్ రాగం - చాపుతాళం.

కరుణసేయవే రమా కామినీమనోహర । సరసిజాతపత్ర నేత్ర సాధుమనస్తత్పర ॥ కరుణ ॥ ౧ ॥ పామరుడతికాము సాన్వితసోమరుడని జూడకు । రామనామ మేమియు మదినే మరవిడనాడకు ॥ కరుణ ॥ ౨ ॥ మలినయుతుడ చలనగతుడ వలననేరమెంచకు । కలపనలఘు కలుషజలధినలగినన్ను ముంచకు ॥ కరుణ ॥ ౩ ॥ మనమునననుదినమునీదు ఘనమునెంచివేడితి । యోగిపెనగికణగినట్టిగుణములదిగనాడితి ॥ కరుణ ॥ ౪ ॥ ఐహికాముష్మికసుఖసాహములబాసితి ॥ దేహిదేహమోహపూహపోహణములరోసితి ॥ కరుణ ॥ ౫ ॥ రేపుమాపు శ్రీపతినీప్రాపు దాపనినమ్మితి । యేపుచూపనోపుకోతతాపములను జిమ్మితి ॥ కరుణ ॥ ౬ ॥ కంటివింటినీపదములు జంటబాయకుంటిని । కంటుగెంటియుంటి నీకుబంటుబంటునంటిని ॥ కరుణ ॥ ౭ ॥ పాంచభౌతికాఖిల ప్రపంచమైన తెలుకను । గాంచితెంచిమించి నిన్భజించెద నేమరకను ॥ కరుణ ॥ ౮ ॥ మాటిమాటి దాటిసూటిరెంటిస్వప్రకాశుడ । ధాటిసాటి లూటిభాను కోటియాపరేశుడ ॥ కరుణ ॥ ౯ ॥ మాటిమీటినాటినక్రియతోటినిన్ను గొల్వగా । వ్రోటుపాటు చేటులేనిచీటు నేటుచెల్వగా ॥ కరుణ ॥ ౧౦ ॥ ప్రొక్కితి హరిదక్కితివని యెక్కితికుధరంబును । నిక్కితివృథగక్కితి సుధ మెక్కితిమధురంబును ॥ కరుణ ॥ ౧౧ ॥ పండితవ్యాన్మండితోరుఖండితభవసంచిత । మండలోర్ధ్వకుండలీయ ఖండితకల్పాంచిత ॥ కరుణ ॥ ౧౨ ॥ వాసవనుత దాసవినుతభా సురభద్రాచల । వాసవాసుదేవఫీరు దాసపాలితాంచల ॥ కరుణ ॥

౪. కీర్తన - ముఖారి రాగం, అటతాళం.

ఎంతనిర్దయ మానసుడవు । రామనే । నెంత వేడిన కండ్లపడవు। మంత మేటికి రమాకాంత నీమనమున । వ్వంతైన గరుగదు యెంతకాతి న్యమా ॥ ఎంత ॥ ౧ ॥ నీదాసులగు వారియందు । నీలాని । రాద

రించుటకేమనందు । సాదరంబుగ నీప్రసాద మిం[illegible]వంత । బీదవానీదు మర్యాద యింతేకాద ॥ ఎంత ॥ ౨ ॥ అన్నద[illegible]ల [illegible]వైరమునను భానుజుఁడు । విన్నవించిన వాక్యములను । తిన్నగా ధర్మంబుదీర్చక నె దోషమని । యెన్నకను వాలినొక యేటుననుఁ మాటితివి ॥ ఎంత ॥ 3 ॥ ఘననీతి శాలియైనట్టి । జానకిని । జనలోక వాదుకనుబట్టి । వినయమించుక లేకవీరపత్నీ మనసు । కనలేకఘోర కాననములకు బంచితివి ॥ ఎంత ॥ ౪ ॥ ఘనుడు వాల్మీకిఋషివెంట । వచ్చిపృథుఁగానమును సేయుగావింట । నణుమాత్రమైన నాహ్లాదమొందకను నీ । తనయులగు కుశలవులి । తరులుగానెంచితివి॥ ఎంత॥ ౫ ॥ బలధార్తరాష్ట్రీ పాండవులు నుభయులకు గల పోరుదీర్పగాజాలు । తొలిమధ్యవర్తివని బిలిచినను ధార్తరా । ష్ట్రీలను జంపించితివి వలపటమును జేసి ॥ ఎంత ॥ ౬ ॥ అలమహాదాన గుణశాలియైనట్టి । బలినివంచింప దయమాలి। బలుకవట వటునివలె నిలిచిమూడవ నడుగు । తలనుంచి వడిరసా । తలమునకు ద్రొక్కితివి ॥ ఎంత ॥ ౭ ॥ క్రయములకుల కొలదిగాను విక్రయించియు నిజోత్సవ సేవగాను । నియతిదప్పక సేయుని లరామ దాసునిటు । దయలేకకొన్నాళ్లు ఖయిదు లోనుంచితివి । ఎంత॥ దాసుడై యితరంబుమాని పంతతోల్లాసమున నీసేవబూని । జేసినభక్తిభాసిలు తూమునరసింహ దాసునింబట్టి గోదావరిని ద్రోచితివి ॥ ఎంత ॥ ౯ ॥ ఎపుడునీసేవకుల నెల్లనీరీతి కృపదప్పి చూడవేనుల్ల । నపరాధమెన్నకను నాశ్రితత్రాణైకని పుణుడీవని వింటికృపజూడకున్నావు॥ ఎంత ॥ ౧౦ ॥ వాసిగాగోదావరిని భద్రాద్రి । వాసుడై నెలకొంటివని । యాసించుకొని పీరుదాసుడను నీకునే । దోసిలొగ్గిన కరుణజేసి రాకున్నావు ॥ ఎంతనిర్దయ ॥ ౧౧ ॥

—:o:—

# ఫీరందాసకృతజ్ఞానభావకీర్తనలు.

౧. శంకరాభరణరాగం - ఆదితాళం.

పరంధామ శ్రీధరుండవని నినుమునివరులెటుల నుతియించిరో ।
నిరాతంకసుస్థిరానంద తత్పరత్వసుఖ మెటులగాంచిరో ॥ పరంధామ॥
౧ ॥ అహంకారకుండవై విరాజిల్లు నీస్వరూప మెటులవర్ణించిరో । స్ఫురన్ని
జహృదంతరస్థితుండవై ధరింపనెటుల లక్షించిరో ॥ పరంధా ॥ ౨ ॥
అమాయకుండవై సమస్తబ్రహ్మాండ ముల్కుక్షి నెటులుంచితో । రమే
శనీవాది మధ్యాంత శూన్యమై యెటుల వ్యాపించితో ॥ పరంధామ ॥
౩ ॥ నిరంజనుండవై చరాచరాకృతిశరీరముల నెట్లుదాల్చితో । క్షరాక్ష
ర విలక్షణావ్యయ పరాత్పరాత్మవై యెటు నిల్చితో ॥ పరంధామ ॥
౪ ॥ గణింపరాని యగుణుండనీచే గుణత్రయం బెటులాయెనో । గు
ణాతీతకారణ త్రిమూర్తికరణస్వత్వమే చాయనో ॥ పరంధామ॥ ౫॥
నిరామయులెనావరింపనీచే ధరావ్యోమ ముఖరంబులౌ । ధరింపగస్థా
వరాదిజంతు నికరంబులతిసుఖంబులౌ ॥ పరంధామ॥ ౬॥ అకాముండ
వై వికాసింప నీవికారంబు లెటుగల్గెనో । సకామాది విశ్వకల్పన వి
లాసకుండనగ నెట్లుచెల్లెనో ॥ పరంధామ ॥ ౭ ॥ త్రిలోకములు నీవిలో
కనముచే వెలుంగనెట్లు పాలింతువో । తలంపుడిగి నిశ్చలద్యోగ నిద్ర
లో నెటు గావింతువో ॥ పరంధామ ॥ ౮ ॥ భవస్థితిలయాది వర్తనము
లందువర్తింప నెటులైతివో । దివాకర శశాంక వహ్న్యాత్మా రాధ్యవా
ర్యరుచు లెటుల తేతువో ॥ పరంధామ ॥ ౯ ॥ అనవరతము సజ్జనుల్వి
శ్వపావనుండంచు భావింతురు । కనత్కళాబిందు నాదములకెట్లు సనా
తనునిగాగాంతురు ॥ పరంధామ ॥ ౧౦ ॥ సమాయాప్రపంచ మూల
ప్రకృతికాది మూలమైయొక రీతిగా । సమస్తంబు లీనమైనతరి సత్య
మైయుండు విఖ్యాతిగా ॥ పరంధామ ॥ ౧౧ ॥ చలాచల విభృత్తులం

బడక కేవలాత్మగా ప్రకటింతువు । సులతుల్యార్థ నిస్తులాచింత్య నిర్మ లాత్మగా శోభింతువు ॥ పరంధామ ॥ ౧౨ ॥ ధరాధభద్రభూధరేశ కో దండరామ విధిశివసేవితా । స్ఫురచ్ఛేష సద్గురోనుకం పాశ్వార్థి ఫీర్దా సావిత ॥ పరంధామ ॥ ౧౩ ॥

౨. కాఫిరాగము – ఆదితాళము.

ఎంతో బ్రహ్మానందమాయెనుమన చింతాలన్ని దీరిపోయెను। సం తసమునహృదయాంతరంగమునాత్మాచింతనచేత నిహచింత లేనట్టివా రి ॥ కెంతో ॥ ౧ ॥ కీకారణ్యముబయలాయెను । యొంటివ్యేకాముగీట ణగిపోయెను । ఏకాంతమునకొండ కూకలుసమసిని । లోకనిరింద్రి యానిరాకాశులైనవారికి ॥ ఎంతో ॥ ౨ ॥ ఏడుకోటాలుకోలుపోయె నే । ఈరేడులోకము లేక మాయెనే । యాడుచుబంగారుమేడలోప లజొచ్చి । ఈడైనముక్తికాంతనుకూడియున్నట్టివారికి ॥ ఎంతో ॥ ౩॥ దండిచీకటివెల్లురాయెనే చిన్మార్తాండుడఖండ తేజుండాయెనే । నిండు మున్నీటిమీద పుండరీకములోన । మండేమరందమనుభవించిరులైనవా రికి ॥ ఎంతో ॥ ౪ ॥ సాకారగుణజయమాయెనే తన్నిరాకార పరవశ మాయెనే । ఆకాంక్షవిషయాది లోకాతిరిక్తపర । మేకచక్ర ముగను జోకతోనేలువారికి ॥ ఎంతో ॥ ౫ ॥ మర్మములన్నివీడిపోయెనే । సర్వ ధర్మపరిత్యజమాయెనే । దుర్మోహపాశపరినిర్మితమనః పూర్వకర్మవర్జిత నిత్యనిర్మలులైనవారికి ॥ ఎంతో ॥ ౬ ॥ భూమియాకాశ మేకమా యెనే । డెందమామీద నిర్వికల్పమాయెనే । నామరూపవికారస్తోమమా విలీనామై నిరామయమొందియు నికనేమియు గానివారికి ॥ ఎంతో ॥ ౭ ॥ భాసురభద్రాద్రివాసుడై యొప్పు । శ్రీసీతారాములకు దాసు డై । శ్రీశేషగురు సత్కృపాసమన్విత ఫీరుదాసాఖ్య సావకాత్మోల్లాస మొందినవారికి ॥ ఎంతో బ్రహ్మానం ॥ ౮ ॥

౩. శుద్ధకాంభోజి రాగం–అటతాళం.

అంతటదిశల మిన్నా పరించిన పరమాత్మ యొకడనున్నాడి ।

యీవృత్తాంత మెల్లవినగ నార్యులచే చాలసంతస మగుచున్నది । కంతమునసే బల్కినానని పండితులు మదినుంచ కిపుడత్యంత మోద మెలర్ప నుపనిషదంత విషులుప్రసంగ రీత్యా ॥ అంతట ॥ ౧ ॥ అల ఘటాకాశ మహాకాశద్వయ మనిపలుకు మాత్రమైయుండగా । ఘటము పొలశినద్వయ నామము లేదాకాశమాత్ర । మలరుచున్నదినిందుగ । తలప నాకాశ తత్వముతో ధరణిమొదలగు సకలభూతా ఘలలితప్రాపంచ బహిరంగాంత రంగములందు నెడపక ॥ అంతట ॥ ౨ ॥ ఆకాశశరీరం బ్రహ్మంబని శ్రుతియందు జోక పలుకుచున్నది । చూడ । నాకాశమేక మనేకవస్తువులొందె । ప్రాకటమైయున్నది । యాకసంబన శబ్దమాత్రము నాకసము లేదనుచుపల్కుదు । రాకసమునొక నేర్పు వలన నిరాకరించు తెలంగుదెల్పుడీ ॥ అంతట ॥ ౩ ॥ మున్నువ్యామాతీతన్నిరంజన మనియున్న యాగమవాక్యము । గాన । మిన్నుమన్నుకొనన్న దాని మిగిలున్నది పరసౌఖ్యము । మిన్నునాత్మని దెలిసి యెందఱు విన్నివిధముల నెంచిచూచిన । మిన్నుగాదది దాటి ప్రత్యగభిన్నమాత్మను గాంచుట క్రియ ॥ అంతట ॥ ౪ ॥ నినదగుణంబున నింగియ నదగెను । నినదముడగినంతనే । వ్యోము । మనులేదు నిశ్శబ్దమునుద్రి । వ్యోమనియూరకను గొందరన్నంతనె । యనఘులటు కాదందురారవగుణక నాకమునొ్యనుభవసర । నివిలీనము జేసినిశ్శబ్దభవమును నిరారవబ్రహ్మమగునెటు ॥ అంతట ॥ ౫ ॥ కాసారతీర సంకాసిత భద్రగిరీ సిఖరావాసమై । చిద్విలాస పరసతిజానకీశ జ్యోతిర్మయా । కాశాతీతోల్లాసమై । భాసుర శ్రీరామ తత్వముదాస హృద్యము శేషగురుకరుణాసమన్విత ఫీమదాసాఖ్యాన మగుపరమాత్మ నిరతము ॥ అంతటదిశల మిన్నావరించిన పరమాత్మ యొక్కడనున్నాది ॥

### ౪. శహానరాగం ఆదితాళం.

పరిపూర్ణమైనట్టి బట్టబయలులోన నొలుకలేకనె గల్గెను । అరుదుగకలయందు పరికించుచిత్రముల తెలుగున నీచరాచర విశ్వాకృతిగా

ను ॥ పరిపూర్ణ ॥ ౧ ॥ అరుణాకరముల దోచునంబులాగుననం । ఖర
సూనముచందమున । నరయరజ్జువునందు నురగమువిధమున వరనారికే
ళాంతరవారి జనితమైనట్లు ॥ పరిపూర్ణ ॥ ౨ ॥ మూలప్రకృతి యాల
వాలముగతన । మూలముతానెగాగను । లీలావిలాసముగ కాలకాల
రూపమై । యొలిత్రిగుణాహంకారలయమైసర్వ ॥ పరిపూ ॥ ౩ ॥ హర
విష్ణు విరించినిజ రాంబుకృశాను । మరుదభ్ర పంచకమునై । పర
సరిదంభోధి తరుగుల్మలతభూమి ధరమృగవిహంగాదిభరితమై కనుపట్టి॥
పరిపూ ॥ ౪ ॥ తనువునింద్రియములై మనసువికారములై । యనసి
విషయవృత్తులై కనుపట్టి కులాశ్రమాగార వర్తనంబులై । జననానాశ
ములకు నునికిపట్టుతానయ్యె ॥ పరిపూర్ణ ॥ ౫ ॥ రమణీయశాస్త్ర పు
రాణవేదాగమ । సమితివాదభేదములై । భ్రమరూపమైనట్టి బ్రహ్మాండ
భాండానం । తములై జూపట్టి చిత్రములు జేయుచుండును ॥ పరి ॥ ౬ ॥
అన్నితానై యుండి యన్నిటికిని వేరై యున్నాననుచు బల్కును మెన్న
గనలవిగా కున్నది లేనిదని । యున్నదనును యున్నదెన్నడు లేదను ॥ ప
రిపూ ॥ ౭ ॥ పాపపుణ్యకర్మకు లోబడిపలువుచు నాపద సంపదలప్రా
పించును భవబద్ధులు గనునరక । కూపములనుద్రోసి తాపమొందును
దానే । పరిపూ ॥ ౮ ॥ అనయమూర్ణ నాభియును సృజించుభక్షించు ।
పనుపడి పటములను । కొనగా తంతువు చేతజనిన రీతినిమొల్లక । జని
తమైవిశ్వము గీనునుద్రుంచి తానేగు ॥ పరిపూర్ణ ॥ ౯ ॥ జలముచేవని
గల్లుగలిగి తనకుతాన । బొలియుచందమీ తెల్వియు । చలనములేని
కేవల పరిపూర్ణములో । పలదోచగురు కృపతెలిసిన తానెలేదు ॥ పరి॥
౧౦ ॥ కాసారతీర సంకాసితభద్రగిరీ శిఖరావాసా ॥ వాసుదేవశేష గు
రోసత్కృపను శ్రీద్దాసురక్షించు తత్వార్థశిద్ధిగా ॥ పరిపూర్ణమైనట్టి బట్ట
బయలులోన ॥ ౧౧ ॥

# శ్రీరుద్దాసకృత-అచలభావము.

౧ - బేగడరాగము - త్రిపుటతాళము.

ఏమి చెప్పుదు నేమి జూపుదు నీమహాపదరమ్యము। తామరసం గ ర్భాదులైనను దలపరాని దగమ్యము ॥ ౧ ॥ అంద్రియుండక పొందిపొందక సందులేకను యున్నది। ముందు సనకసనందనాదుల డెందములకై యున్నది ॥ ఏమి ॥ ౨ ॥ దిక్కుదిక్కుల పిక్కటిల్లుచునక్క జంబై యున్నది। చొక్కమైయాటక్కు పిక్కుల నిక్కు లెఱుగక యున్నది ॥ ఏమి ॥ ౩ ॥ చూపురూపును కోపుగేపును యేపుమాపును గానిది। యాపుగాపును ప్రాపుదాపును రేపుమాపై యున్నది ॥ ఏమి ॥ ౪ ॥ ఎప్పటికినొక ముప్పులేకను కప్పికదలక నున్నది। తప్పులొప్పుల తిప్పలెఱుగక కుప్పరముగాకున్నది ॥ ౫ ॥ రాకపోకలు లేకచలనముగాక నేకంబైనది। టేకుటాకులుపోక రాకను శ్రీకరాకరమైనది॥ఏమి॥ ౬ ॥ ఎన్నిపుట్టిన నెన్నిగిట్టిన నన్నిటికి చెడకున్నది। వన్నెచిన్నెలన్ని సున్నగనన్నిటికి మింగిలున్నది ॥ ఏమి ॥ ౭ ॥ అండపిండా బ్రాండభాండోద్దండతండము గానిది। నిండి ఖండాఖండములకును దండయుండయునైనది ॥ ఏమి ॥ ౮ ॥ చింతవంతలు వింతపొంతలు తంతుపంతములేనిది। యంతకంతకనంతమై భావంతమింతయు గానిది ॥ ఏమి ॥ ౯ ॥ మాతృపితృ భ్రాతృగోత్ర పవిత్రపాత్రముగానిది। క్షేత్రపాత్రా పాత్రగాత్ర పవిత్రసూత్రకమైనది ॥ ఏమి ॥ ౧౦ ॥ అంటుగొంటులు నొంటిజంటలు కంటుగొంటులు లేనిది। అంటియంటక నొంటిరొంటక మింటితొంటిది మైనది ॥ ఏమి ॥ ౧౧ ॥ పొంకుబొంకులు ఝుంకజంకులు వంకశంకలు లేనిది। గ్రుంక్కుడ్రుంకులు సంకశంకము లింకిపొంకంబైనది॥ ఏమి ॥ ౧౨ ॥ భాసురంబగు శేషగురు కరుణాసమన్విత మైనదీ। శ్రీద్దాసునేలిన భద్రశైలని వాసమనదగి యున్నది ॥ ఏమి ॥ ౧౩ ॥

## ౨. సావేరిరాగం అటతాళం.

రామానీస్వ స్వరూపమరయగని। రామయమైయున్నది । సీతా రామయిదే మోమరేమియుగాకను యేమనరాకున్నది । కామరాగములేమిలేకను నామరూప వికారగుణముల । భూమినిష్టల కందరాకను ధామసన్మోదం బెలర్పగ ॥ రామా ॥ ౧ ॥ జననమరణములనుజెందకెపుడు నిరంజనము నిరాకారమై । జనా । ర్దనశూలిధాత్రాదియునిమిషమునిజను । ల్వినుతింపనాకారమై । యనుపమానమై యాద్యంతరహితమై । తనరియింద్రియములగ్గను గొనరాకను । తనమనఃప్రాణాదివృత్తులదగులకెపుడు మిగిలితానే । ననకనాహంభావ వైకృతమునకుబాల్పడకలరుచున్నది ॥ రామా ॥ ౨ ॥ తరుగక విరుగక పెరుగక కరుగక మరుగువరుగులేకను । చరా । చరరూపమైన యజాండకోటులనెల్ల । నిరవుతానై గాకను । పరికింపభావా భావాతీతమై । పరమపవిత్రమైభాసిలుచున్నది । ధరణిజలపావక సమీరాంబరము లైదుమశబ్దమాదిగ । పరగతన్మాత్రౌఘ భవసంసరణ భావమెఱుంగకున్నది ॥ రామా ॥ ౩ ॥ ఎఱుకచేజనియించు నెల్లలోకములను రెఱుకేవర్ధన సేయును । మరలి । హరియించుభరియించు పరియించుచరియించు । తరియించుతానాయను । అరనిమిషమంత మహాయుగమునుజేయు మరలిగోప్పద మాత్రమఖిలధరిత్రిగ । తిరిగిమేరువతృణముసేయును తృణముమేరువగానొనర్చును। మెఱువువలెకనరాక నరిగెడుయెఱుకజోలేమెఱుగకున్నది ॥ రామా ॥ ౪ ॥ కలపోలికనుద్యోము తెలివి దేహముజగం। బులుబీజవృత్తాగతి। ప్రకృతిబలిసినగురుకృపవలన మేలుకొన్న। కలమిథ్యయాజగతి తెలివిలేనంతకే। వలపరిపూర్ణమై । పాలుపొందలోపలన్వెలుపలనంతట। చలనమచలముగాక వెలిగెడు వెలుగులకువెలుగయ్యె వెలుగక । కలుగకనుమలుగకనునలుగక । దగులకనుమెలుగకను యున్నది ॥ రామా॥ ౫ ॥ వాసనత్రయగుణ వాసితవృత్తుల । మోసము లేకున్నది । చిద్వి। లాసములను కించిహోసవాసములా । భాసము లేకున్న

ది । దోసకోసముల వేసటలెఱుగక । నీనడింపనిషు మంలౌకలేకున్నది। భాసురంబు శేషగురుకరుణా సమన్వితమింపొదవక। ర్ధానుడనురక్షింప భద్రగిరీశుడై వెలుగొందునాత్మా ॥ రామానీస్వస్వరూపమరయగ ॥ ౬॥

౩. శుద్ధకాంభోధిరాగం - ఆదితాళం.

పూర్ణమైయున్నదది । నిరాద్యంతవి । స్తీర్ణమైయున్నదది । వర్ణధర్మాశ్రమనిర్ణయమునులేక । నిర్ణినాదభవార్ణవోత్తీర్ణమైయున్నది ॥ పూర్ణమై ॥ ౧ ॥ అన్నిటిమీఁగిలినది । తనకులౌనై । యున్నపరమాత్మ యది । మన్ననిరగ్నిగాదున్నమిన్నులమీరిలావు । సన్నముగాక ప్రసన్న మైయున్నది । పూ ॥ ౨ ॥ సత్తుచిత్తునుగానిది । నిత్యమైనద । సత్తురిత్తైయున్నది । చిత్తవైకారికాయత్తులకందరాక । సత్తామాత్రాము త్తమోత్తమమైనది ॥ పూ ॥ ౩ ॥ బిందుకళయుగానిది । అందియుండక । సందులేకనేయున్నది । యిందునందసరాకనెందుజూచినతానై । మందమానసులకు । పొందశక్యముగాక॥ పూ॥ ౪ ॥ యోగముగానిదది యైహికపర। భోగములేనిదది । రాగద్వేషవి।యోగవంయోగార్థత్యా। గమైనరాజయోగభోగ మయినాది ॥ పూ ॥ ౫ ॥ రూపములేనిదది । దృష్ట్యత్యద్భుతమా । రోపణగానిదది।చూపులకందకని । ర్లేపకమైనది । చూపువలపులేని।ప్రాపకమైనాది ॥ పూ ॥ ౬ ॥ రాకపోకలు లేనిది । యంతర్బహిర్వ్యాప్తికవిషయిగానిది । యేకమనేకవి।లోకలోకాకృతి । పీకగన్పించునెఱుకలేకనిరాకృతి ॥ పూ ॥ ౭ ॥ ఖండముగానిదది।ఖండాఖండములు।నిండితానైయున్నది । అండపిండాండబ్రహ్మాండకోట్లకు రాట్పై। చండమైదోచుటకు।అండదండైనది ॥పూ॥౮॥ దివనిశములులేనిది హరిహరబ్రహ్మ।దివినుతారకమైనది । భవమునాశముజాడ। లవమునెం దుదగులక । నవిరళానారతప్రవిమలమైనది ॥ పూ ॥ ౯ ॥ మానవము జెందనిది । శాంతమైయువమానముసెందనిది । పూనిప్రకృతిపురుష జ్ఞానాజ్ఞానాములేక । మానితానందసర్వజ్ఞానాతీతమైనాది ॥పూ॥ ౧౦ ॥ త్రిపుటిముగానిదది । యంతరాంతర।త్రిపుటులులేనిదది । జాగ్రతస్వ

ధ్యాయ | నిపుణులకందరాక।నపరిమితమైనగురుకృప నుపథించునది॥ పూర్ణమై ॥ ౧౧ ॥ వాసనలేనిదది । సదాసచ్చిద్విలాస-ము[illegible]ంచినది। భాసురశేషగురు దయాసమన్వితఫీరు । దాసపోషితభద్రాద్రీశమైయున్నది ॥ పూర్ణమైయున్నదది॥ ౧౨॥

౪. భైరవిరాగం - అటతాళం.

ఈమూలమ్ములేనిగుర్తెటిగేశరీరం । జేమిలేదనిచెప్పెనే । కోమలిరోయిది కోటిమారులకైన । నేమారకుమనెనె ॥ సద్గురుమూర్తి । భామరోయీావృత్తబట్టబయులేకాని । యేమిలేదనిపల్కెనే । నామీాదనెడపక నామహామహానిద।యామృతమునుజిల్కెనే ॥ శ్రీగురుమూర్తి ॥ ఈమూలమ్ము ॥ ౧ ॥ వనజనాభుఁడుసాందీ - పునిచేసంగ్రహించి । యనుమానమునులేకను। దనుపరిపూర్ణుఁడై జనుదేరగాంచి । రుక్మిణియడిగినవీకను । వనితామణితోనే మనకనూరకుం । డినసరేననజోకను । ఉనికిగాంచి మోదమునసీరహస్య సూచనజేసెననరాకను। సద్గురుమూర్తి॥ ఈమూలము॥౨॥కలలోనదోచినకరియేమిలేనటు। వలెనులేదనిచెప్పెనే। కలకాలమొకరీతిగా సమస్తలోకములను నిండియొప్పెనే । పలుకులనంటకభావమునొందక । వెలయుచుండుననెనే । తలపునించుకైనతలపోయరాకని । శ్చలముగనుండుననెనే॥సద్గురుమూర్తి ॥ ఈమూలము ॥౩॥ మృగతృష్ణకలయందు నిగనిగదోచునీ । రుగజగదాభాసము । దగులరజ్జువందు-రగముదోచిననత్తె-రగునమాయావాసము । గగన ప్రసూనము । నగుపడ్డబొల్పునమిగులచిద్విలాసము । జిగిమీారవంధ్యపుత్రగతిదోచుదృశ్య । దృగదృక్పరిహాసము ॥ శ్రీగురుమూర్తి॥ఈమూలము॥౪॥ సకలదేశములందు సచరాచరములందు । నొకరీతిగాకుండును । సుకరమైయంతటసూదిమోపసంది । వ్యకస్తత్యమైయుండెనే । అకలంకమైయడపకసర్వకాలము । వికలమొందకుండునే । ప్రకటితమైసర్వపరిపూర్ణమైనిర్లేపకమై వెలయుననెనే॥సద్గురుమూర్తి॥ ఈమూలము॥౫॥నానావిధములపుంఖానుపుంఖములురు । మీానాధికములెన్నియు। మానుగ

బుట్టినలీనమైదన ! లోనజూడనన్నియు । అనీరధిమెరుగలేనటునీబ్రహ్మాండానీకములునన్నియు. । పూనిజనించినపోయిననెఱుక । తానుండుబయలనెనే ॥ శ్రీగురుమూర్తి ॥ ఈమూలము ॥ ౬ ॥ పుట్టను యెన్నడుగిట్టదు యెందున । ముట్టదుపరికింపగా । పుట్టుగిట్టులకున్కి-పట్టెమిట్టిపడు । నట్టిమెఱుకచలించగా । అట్టిట్టుకదలకచట్టువిధంబున । గుట్టుదెలియదెంచగా । దిట్టముగాగను పట్టరాకనుత్త । బట్టబయలుభ్రమించగా॥ శ్రీగురుమూర్తి ॥ ఈమూలములేని ॥౭॥ కాసారతీరసంకాశితభద్రగిరీశది వ్యధామము । వాసుదేవ తత్వభాసమాన శ్రీనివాసమాత్మారామము । శ్రీశేషగురుసత్కృపాసమన్విత ఫీరుదాసాభినుతనామము । వాసనరహితసుధీసంయమీమానసాభ్యాసనిర్వారామము॥శ్రీగురుమూర్తి॥ ఈమూలములేని గురైతిగెశరీరం॥

౫ - సురటరాగము జంపెతాళము.

ఈ మహాగోప్యంబు నెవరందగలరు । శ్రీమించుసద్గురుస్వామి చేనలరు । ఆమహాదేవదైత్యారివిరించిను । త్రామాదిసురహృదంతర్గతంబు । నీమానవులుసంగ్రహించెనెంతటివారు । భ్రామికహరణమై ప్రబలాభేద్యంబై । ఈమహా ॥ ౧ ॥ ఇట్టిదట్టిదటంచునెఱిగింపగారాదు పుట్టిగిట్టెడుదానిపోడిమెఱుంగకను । చట్టువలెగదలకను సర్వపరిపూర్ణముగు । గుట్టుదేసికుజేరిగొలిచిబడయకను॥ఈమహా॥ ౨ ॥ తనమహిమకొంచెమైనను జూపకనులెస్స । తనమహిమచూపుదానినినెఱుంగకను । అనరాకవినరాక కనరాకపెనురాక ; లనుపోకలనుజెందకను వెలుంగకను ॥ ఈమహా॥౩॥ రూపనామక్రియాలాపసల్లాపకా । రోపణంబులచేనిరూపింపరాకఁ ప్రాబల్యలోబల్యపైబల్యలస్థిరి । నూపనిషత్సారమైపరువ్వీకఁ । ఈమహా ॥ ౪ ॥ ఏవికారములేక నేవికల్పములేక । నేవిచిత్రములేక పీకనింపానరు । నేవిలాసములేక । నేవిశేషములేక । నేవిచారములేక నేకమైతనరు ॥ ఈమహా ॥ ౫ ॥ కాసార తీరసంకాశమగుభద్రాద్రి । వాసస్వయంపరం భాసమిరవుగను । శ్రీశేషగురు

సత్కృపాసమన్వితఫీరు । దాసునకుసంతతాభ్యాసముయిదగనూ॥ ఈమహాగోప్యంబు నెవరందగలరు ॥ ౬ ॥

౬ - నాదనామక్రియ - ఆదితాళం.

ఈజగమునఫీరోజి గురువరుడోజదెల్పినది యదేకదా । పూజనియ్యమైబుధవర్యులు పరిపూర్ణంబనునదియదేకదా ॥ ౧ ॥ జననమరణములజాడలెఱుంగక చెప్పరానిగురి యదేకదా । మును మునిజనములు మనముననిశము మననముజేసెదదేకదా ॥ ౨ ॥ ఉత్తబట్టబయలేమి లేదనుచు నున్నద్వాదశియిదేకదా ॥ వేత్తలెల్లపరి పూర్ణంబనుచును వెదకుచున్నదియదేకదా ॥ ౩ ॥ ఇతరదైవముల నెన్నెడివారలు యెఱుగలేనిదియదేకదా । మతభేదంబులమానియచలమై మహానియ్యంబగునదేకదా ॥ ౪ ॥ శ్రీరాముఁడుహనుమంతున కొసగినశ్రీపరిపూర్ణంబదేకదా । మారుతినిర్మలమతిచే దలచినమహానియ్యంబన నదేకదా॥ ౫ ॥ మూలములేనిదిమొదలేలేదని మొరలిడుపల్కులుసరేకదా । చాలబయలుసదసద్వర్జితమని సర్వజ్ఞులుగనునదేకదా ॥ ౬ ॥ హరివిరించిశివులాదిత్రైన వారరయునిధానంబదేకదా । వెలుపులుపులను మానియచలమై యెఱుగరానిగురియదేకదా ॥ ౭ ॥ తిరుచునాపల్లి రంగస్వామికి తెలిసినయచలం బదేకదా । పులహరిఫీరోజీ గురుదయచే బొందినపూర్ణంబదేకదా ॥ యీజగమున ఫీరోజీగురువరుడోజ ॥ ౮ ॥



# మంగళహారతి



బాగుమీరగ బ్రహ్మయోగ సమాధినిష్ఠా గరిష్ఠరాజయోగికిని । రాగద్వేషాపరిత్యాగ బ్రహ్మాత్మసయోగానంద । నిజభోగికిని ॥ జయ ॥ మంగళం॥

విశ్వప్రభునాకు విశ్వాంతరాత్మాకు। విశ్వరూపునాకువిశ్వనకు। విశ్వప్రకాశికి । విశ్వగర్భునకువిశ్వమూల పరమేశ్వరునకు ॥ జయ ॥ మంగళం॥

పంచభూతమయ ప్రపంచవిలక్షణుడంచితా కేవలాత్మారతినీ । మించినిత్యంబు శోభించినట్టిముక్తి । పంచాతీతుడై బరుగు నాత్మారామా ॥మంగళం ॥

అందు-ఇందనరాక యెందుజూచిన పొలుపొంద సూదిమోపసందులేక । పొంది పో పొందకానందినందక నెపుడుస।నందన్నాదిమనోనందకందళితాత్మ ॥ మంగళం ॥

సారాములేని సంసారాబ్ధిదాటింప నేరుపుగల్గియింపారునట్టి । పారాములేక సంపూర్ణమయి సర్వార్థ । సారామై వెలయునాత్మారామగురుమూర్తి ॥ మంగళం ॥

నానాభూతో పాధిష్ఠానమైజ్ఞానా । జ్ఞానాతీతసన్నిధానానకు । హానివృద్ధిజగల్లీనమై మిగిలిబ్రహ్మానంద మూర్తిపై దానె దానగుస్వామి॥ మంగళం ॥

మూడారును పదమూడులేకను నొకమూడునైదును నాల్గుమూడింటిని । వీడిచూడజూడ పోడిమితనలోని జాడనరుగునొంటిదోడు గల్గినస్వామి ॥ మంగళం ॥

అండచేసుక విధాతుండు సరోజ నాభుండు హరుండు నాఖండ

లుండు। నుండీతుఁడై సర్వాజాండాము నేలగా। ఖండాఖండము లేక నిండియుండినస్వామి ॥ మంగళం ॥

పెరుగాకవిరుగాక తిరుగాకనే ప్రొద్దుకరత లామలకమై యిరు వొందగా। ధరణిలోను జనుల్ పరికింపరానట్టి। పదమాపావిత్రమై బరిఢేరునాస్వామి ॥ మంగళం ॥

ఏమియేష్టునరాక। యేమీాయుగాకను యాామూాక సర్వాంత ర్యామిగాను। ధీమసమునమాయా। కామరాగము। ఖమేమియంటక నూ నిరా మయమగుతండ్రి ॥మంగళం॥

రాకడపోకడ లేకనేవిశ్వ మనేకమైన దేమిలేకతానై। సా కారమునతన్ని రా కారమునుమీారి। యేకాంతమైన నిరాకాశమగు స్వామి ॥ మంగళం ॥

ఇంతంతయునరాక సంతతమాది మధ్యాంత రహితమై మహాం తముగా। సంతోషాసంతోష మింతాయులేక। నితాంతమైన చి రాంత పూర్ణునాకు ॥ మంగళం ॥

వెలుగాకమలుగాక తొలుగాకకలుగాక పలుకూలనంటాకనల రుచూాను। కలకాలమొకరీతి చలనములేక నచలమైనచలాచల లక్ష ణాగురు ॥ మంగళం ॥ సద్గురురాయా మంగళం ॥

కాసారతీరసం కాసిత భద్రగిరి శిఖరాగ్రనివాసమై। తాశ్రీ శేషగురు సత్ప్రాసమన్వితపీఠు। దాసుని రక్షించు వాసుదేవునకు॥ మంగళం ॥ సద్గురురాయామంగళం ॥ జయమంగళం॥

మంగళహారతి— రాగం—సురట.

మంగళం-మంగళం పరబ్రహ్మగురుస్వామి। మంగళంమంగళం॥ ఆదిమధ్యాంత రహితంబునూనై। అప్రమేయ నిరాలంబమూనై। నా దుబిందుకళల కమలాయతీతమై భేధభేధాతిరిక్తపరిపూర్ణము ॥ మంగ ళం॥ మంగళం॥

శశవిషాణాకాశ జలజాతాములభంగి । చలనమానీదృశ్య జా మెఱుగకను । అశదృశంబగుశుద్ధ అచలమైవెలుగొందు ఆశరీరమగు సచ్చిదానంతరహితము ॥ మంగళం మంగళం ॥

క్షరమక్షరముగాక । సత్తుచిత్తులులేక సగుణనిర్గుణమూలను జాడయెఱుగకనూస్థిరమై-అతీతమా । చిన్మాత్రమునుమిా । రుపరమాకాశ నంత । నిశ్శబ్దము ॥ మంగళం మంగళం ॥

ఫీరోజీగురుచరణా । బిసరుహాధ్యాసలనూ । శ్రీరంగాయాఖ్యుం డు చెందినపొందినది సారమై అతినిర్వికారమై ॥ అఖిలామాకారణతీత చిద్గగ నాతిరిక్తులము ॥ మంగళం మంగళం॥

ఇది శ్రీమద్వేదాంతసార, సచ్చిదానంద రహితుండును, ప్రకృతిద్వయదోష రహితుండును, నాదబిందు కళాతీతుండును. ఉపాధిద్వయదోష రహితుండును, అశరీరుండును-అచల పరిపూర్ణుండునునగు, పులహరి- ఫీరోజీగురుస్వాములవారికటాక్షంబున, తిరుచునాపల్లి, రంగస్వామి శెట్టి- ఆంధ్రంబున రచియించి, అచల గురుండగు, పోకల-శేషాచలాహ్వాయునిచేదిద్దుబాటుచేయించి, ప్రచురింపంబడిన తత్వకీర్తనలు సహాస్రంబునుమూడవ - అధ్యాయము సంపూర్ణము. ఇదే నిజగురు సాంప్రదాయము. ఇదే-సత్యము.

# ప్రకటన



ఈ రిజష్టరుగ్రంధమును

వి. పి. ద్వారా తెప్పించుకొనువారు. కృష్ణాజిల్లాతో చేరిన కారెంపూడి - గ్రామమునందు. హాస్పిటల్, అసిష్ట్యాంటుగారైన - టి. వి. రంగస్వామిసెట్టిగారి పేరట వ్రాశి తెప్పించుకోవచ్చును. అటుల గాకుండిన్న యెడల,

చెన్నపురి - నాటుపిళ్లారిగుడి వీధి నెంబరు ౨౦- గల గృహమునందుండెడు బోకల - శేషాచలమునాయుడుగారి పేరటవ్రాశి యైనను తెప్పించుకో వచ్చును.

| | రూ. అ. పై. |
|---|---|
| గ్రంధముయొక్క వెల. | ౦—౮—౦ |
| మణియార్డరుచార్జి. | ౦—౨—౦ |
| పోష్టుచార్జి. | ౦—౧—౦ |
| | ౦—౧౧—౦ |

వి. పి. ద్వారా తెప్పించు కొనువారలకు పదకొండు అణాలు చార్జి అవును. ఒకసారి ౧౦. గ్రంధములు పుచ్చుకొను వారికి, ఒక గ్రంధము బహుమతిగా నివ్వబడును.

☞ టి. వి. రంగస్వామిసెట్టి.